# ఈనాటకమునందలి ముఖ్యపాత్రలు

పురుషులు.

ప్రతాపసేనుడు—కథానాయకుడు.

కొండభట్టు—ప్రతాపసేనుని గురువు.

ఉత్తమశీలుడు—వైశ్యుఁడు

దుష్టబుద్ధి—మహాపాతకపురపు రాజు.

మహాపాపి, అనృతవాది—దుష్టబుద్ధి మంత్రులు.

మహానీచుడు—దుష్టబుద్ధి సేవకుడు.

దొంగ.

1, 2 రాజకుమారులు.

సేవకుడు.

దూర్వాసుఁడు—ఒకముని.

స్త్రీలు.

కాంతామతి—ప్రతాపసేనుని భార్య, కథానాయిక.

కాంచనమాల—ప్రతాపసేనుని వేశ్య.

రత్నమాల—వేశ్య దాసి.

చంద్రరేఖ—కళింగరాజ పుత్రిక.

కొందఱు దాసీలు, మఱికొందఱు వేశ్యలు.

---

ప్రదర్శకులకు సూచన.

లిఖితరూపకమగు నాయనుమతిని పొందనివారు

ఈ నాటకమును ప్రదర్శింపఁగూడదు.

అటుగాక స్వతంత్రించిన వారలు నానష్టమునకు పాత్రులగుదురు.

వేజండ్ల, గుంటూరుజిల్లా. } జి. కోటేశ్వరరావు, గ్రంథకర్త.

## చతుర్థ ముద్రణపీఠిక



భారతీయ సోదరులారా!

"కాంతామతి" నాటకము నాల్గవకూర్పు కూడ వెలసినదని వచియించుట కెంతయు సంతసించుచున్నాడను. యీనాటక మనేక నాటక సంఘములవారు ప్రదర్శించుచుండిరి. అందుకొన్ని సంఘముల వారు "దుర్బుద్ధికిని, రాజకుమారులకు"ను కొన్ని పద్యములుండిన బాగుండునని పలుమారులు వ్రాయుచుండిరి. అందుచే వారల యాశ్రిత మీడేర్చితిని.

మరియు "ప్రతాపసేనుఁడు" సర్వముంగోల్పోయి కాంతారమునకనిపిన నిజకాంత "కాంతామతి" యన్వేషణము యిదివఱకో విష్కంభమున నుంచితిని. ఆయారంగమును యిప్పుడు "తృతీయాంకమున" తురీయరంగముగ వ్రాసియున్నాడను. గాన ప్రదర్శకులాంరగము నుఁగూడ ప్రదర్శింతురుగాక యనినాకోర్కె.

ఆంధ్రసోదరులెల్లరు ప్రథమ, ద్వితీయ తృతీయ ముద్రణములందు జూపినయాదరణ మీచతుర్థముద్రణమునంగూడ జూపెదరు గాకయని యెల్లరప్రార్థించెదను.

ఇట్లు.

వేజండ్ల,
1—8—1926

గూడూరు కోటేశ్వరరావు
గ్రంథకర్త.



# సంపూర్ణ రామాయణము

(గ్రంథకర్త, గూడూరి కోటేశ్వరరావుగారు.)

ఇందు బ్రహ్మాదిదేవతలు రక్కసులవలన బాధలుపడలేక శ్రీ మహావిష్ణువును ప్రార్థించ శ్రీమహావిష్ణువు దశరథునకు పుత్రుడుగా జనించుట. విశ్వామిత్రుని యాగసంరక్షణము, శిలయైపడియున్న అహల్యను తన పాదరజముచే శాపవిముక్తం జేయుట, హరువిల్లువిరిచి సీతను బెండ్లాడుట, త్రోవలో యెదుర్కొనిన పరశురాముని గర్వభంగము సల్పుట, కైకవరములచే సీతారామలక్ష్మణులు అరణ్యమునకు వెడలుట, దశరథుడు పుత్రప్రేమచే విగతజీవుడగుట, కౌసల్య విచారము, కైక తనకుమారుడగు భరతునకు రాజ్యప్రాప్తి గలిగినదని సంతోషము, భరతుడు కైకను దూషించి, చిత్రకూటపర్వతారణ్యమునయున్న సీతారామలక్ష్మణులను రాజ్యమునకు వచ్చి పట్టాభిషిక్తుడవుగమ్మనుట, పట్టాభిషేకము చేయుమని తన పాదుకను భరతునకొసంగుట, పాదుకాపట్టాభిషేకము, శూర్పణఖ ముక్కుచెవులుగోయుటచే రావణాసురుని కెఱింగించ రావణుడు క్రోధోద్దీపితుండై మారీచుని మాయలేడిగా బంపి సన్యాసివేషమున సీతనపహరించుట, రామలక్ష్మణులు సీతంగానక చింతిల్లుట, సుగ్రీవసఖ్యమున సీతజాడను తెలిసికొనుట, వాలిసంహారము, హనుమంతుడు లంకంబ్రవేశించి సీతం గాంచి అక్షయుని జంపి వనమువిధ్వంసము జేయుట, రావణుడు మండిపడి తోకకుఅగ్ని దగుల్పమనియాజ్ఞనీయ ఆయగ్నితోనే లంకాపురి దహింపజేయుట, అంగద రాయభారము నిష్ఫలంబగుట, రామలక్ష్మణ సుగ్రీవ హనుమంత జాంబవంతాదులతో సముద్రమున సేతువుగట్టి లంకం బ్రవేశించుట, ఇంద్రజిత్తువధ, లక్ష్మణమూర్ఛ, హనుమంతుడు సంజీవిచే లక్ష్మణుని బ్రతికించుట, రామ రావణయుద్ధము, రాముడు రావణుని విగతజీవునిజేయుట, సీతఅగ్నిప్రవేశము, శ్రీరామపట్టాభిషేకము మొదలగు సంశములతో నలరారుచున్నది. చక్కని పాటలుగలవు. వెలస్వల్పము. ఫలమధికము. వెల 1—4—0.

వలయువారు కందుల గోవిందం జనరల్ బుక్కు డిపో

బెజవాడ, కృష్ణాజిల్లా.



శ్రీరస్తు.

# కాంతామతి

## ప్రస్తావన.

[ప్రవేశము—నటుడు.]

శా. శ్రీరామామణి నెప్డు తా నురమునన్ ♦ జెన్నొందఁగాఁ దాల్చిబల్
గారా మొప్పగ మౌనిబృందముల భ ♦ క్తశ్రేణి రక్షింపుచున్
ఘోరాత్ముల్ గడు తుచ్ఛమానసుల ని ♦ ర్మూలంబుగాఁ జేయుచున్
వీరుంగాంచిన విష్ణుమూర్తి యిడుతన్ ♦ బెంపారు నైశ్వర్యముల్

ఇంకను నటి రాకున్నదే? నటీ! యిటురమ్మా.

[ప్రవేశము—నటి]

నాథా—! సెలవు?

నటు—నేఁడు నూతనముగాఁ జేయఁబడిన కాంతామతి నాటకముఁ బ్రదర్శింపవలెనుగదా? నటకులు సిద్ధముగ నుండిరా?

నటి—సిద్ధముగ నేయుండిరి. మనమును తీవ్రపడవలయును.

నటు—చెలీ! ఇంక జాగుసేయక నీ గానకళానైపుణ్యముఁ జూపి యించుకంత సంతసింపఁ జేయుము.

నటి—ఏ ఋతువును గురించి వర్ణింతును?

నటు—పోనిమ్ము. ఋతువువలదు లెమ్ము. ఇపుడు రాగల కుంతలదేశాధీశుండగు ప్రతాపసేనుని యాస్థానమును వర్ణింపుము.

నటి—ఆర్యా! ఆతని కొక యాస్థానముగలదా? వేశ్యయగు కాంచన మాలాలోలుండై సర్వమును నా వెలయాలికి ధారవోసినవానికి యాస్థానమేడ? నేను వర్ణించుటేడ? ఈపండితమండలి ముందా వాని నుచ్చరింపఁదగునా? ఐన నేమనెదరు?

నటు—ఐన వలదు లెమ్ము. ఇప్పటికే నడురేయి గావచ్చినది. ఇంక మనము కర్తవ్య మాచరింతము.

నటి—కాంతా! ఇంతకు కవి యెవ్వరు?

నటు—ఇంకను కవి యెవ్వరైనది యెఱుంగవా? వినుము.

సీ. పరభిషక్ శాస్త్రిను ♦ భవ్యుఁడు మృత్యుంజయ
ధార్మికుం డెవ్వని ♦ తాతతాత?
ఘనకీర్తిసాంద్రుఁ డ ♦ గ్రజముగ సుబ్బయా
ఖ్యాతుఁ డే సుగుణుని ♦ తాత తండ్రి?
శాస్త్ర పురాణముల్ ♦ చదివిన మల్లాభి
ధానుఁ డే మానిసి ♦ తండ్రితండ్రి?
ఘన "వైద్యవేత్తయు ♦ కవిపుంగవుఁడు" వేంక
టశివుఁ డెవ్వానికెనిం ♦ పౌనఁగు తండ్రి?

గీ. అట్టి గూడూరు కోటీశ్వ ♦ రాహ్వయుండు
ధరణి కాంతామతి చరిత్ర ♦ సరసగతిని
నూతనమ్ముగ రచియించె ♦ ఖ్యాతిమీర
పిన్నవాఁడు! కైత జెప్ప ♦ చున్నవాఁడు.

నటి—ఓహో! మన కోటీశ్వరరావా?

నటు—ఔను! ప్రేయసీ! చాలపొద్దయినది పోదము రమ్ము.

నటి—చిత్తము.

(నిష్క్రమింతురు.)





శ్రీ

# కాంతామతి.

## ప్రథమాంకము

ప్రథమరంగము:— కాంచనమాల సౌధము.

[ప్రవేశము:— కాంచనమాల, కొందఱు సఖులు]

(అనుబంధము 1)

నేటికి మూఁడు దినములనుండి నా విటుఁడగు "ప్రతాపసేనుఁడు" రత్నమాల యింటికేఁగుచుండెనని వినియుంటిని. ఐన నేమి లే. అతఁడు నేనన్న ప్రాణముల విడుచును గదా? నేఁడైన రాకయుండునా? వచ్చినతోడనే మాటలప్రత్తిరీతిగా నాతని నిరాకరించియు, బెదరించియుఁ జూచెద. ఆప్రతాపసేనుఁడు నాపైఁగల మోహముచేఁ జీవాట్లైనను దినును. చెప్పుదెబ్బలైనను దినును. ఇందులకు సందియము లేదు. ఆహా! మోహమెంత చెడ్డది? ఎట్టి పురుషసింహునినైనను పదదాసునిఁ జేయును గదా? ధనాధిపునినైనను సేవకునిఁ జేయును గదా? ఈ ప్రపంచమున పురుషులన స్త్రీలచేఁ జిక్కిన కీలుబొమ్మలవంటివారు. ఇందుల కేమియు సందియము లేదు. సఖులారా! మీరిప్పుడే నందనోద్యానమునకుం జని విరిసిన ప్రసూనములఁ గొనితెండు. ఆలసింపకుఁడు. ప్రతాపసేనుఁడు వచ్చువేళ సమీపించినది. ఇక పొండు. శీఘ్రముగ దిరిగి రండు.

సఖులు—అమ్మా! పోయెదము గాని బావగారువచ్చిన నట్టుగా సంచరించెదవో? వానికి బుద్ధివచ్చునట్లొనర్పవలయు. మేమిదేపోయి వచ్చెదము.

కాంచ—మంచిది పోయిరండు.

(సఖులు నిష్క్రమింతురు.)

గీ. వలపులకు బట్టుకొమ్మ మా ♦ వారకాంత
మాయలకు పుట్టినిల్లు, మా ♦ మానిను లిల
రోగములకెల్ల మూలంబు ♦ రోకులంటు
యిట్టి మమ్ములఁజేపట్టి ♦ యేగగలరె?

మఱియు,

గీ. ధనదుని నిరాకరించెడి ♦ ధనికుఁడైన
సర్వవిద్యలు నేర్చిన ♦ సరసుడైన
మూడురోజుల మురిపెంపు ♦ ముద్దుజూపి
సర్వమును సున్న జేయుదే ♦ సానిపోఁకు.

ఇంక నే జెప్పఁబని లేదు. మా వేశ్యలఁగూర్చి ఇదివఱకే యనేక నాటకము లాడుచుండిరి. ఐనను మా వేశ్యలు బహు మాయలమారులు. కపట ప్రేమధారులు. అనృతవాదులు. వేయేల? సర్వము లోకులకే దెలియు. ఇంక రూపలావణ్యములన్న మిసమిసలాడెడి మేడిపండువలె పైపసందులచేతను, కన్నుసైగలచేతను, లేనిపోని వేషభాషల చేతను విటులను లోబఱచుకొను ప్రజ్ఞ సర్వరక్షకుండగునాభగవంతుఁడు మా కులమున కొసంగెను. (లోనకుఁజూచి) ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది. ప్రతాపసేనుడేనా? ఆ! అతడే, నేనింక కోపదృష్టిగలదానివలె నిందు శయనించెద.

(అని నేలపై ముసుగుతో శయనించును.)

[ప్రవేశము:—ప్రతాపసేనుఁడు అలంకృతుఁడై]

నాముద్దులగుమ్మ, నావలపులకలికి, నామనోహరి, కాంచనమాల, ఏది? కాన్పింపకున్న దే ? కాంచనమాలా! కాంచనమాలా ! (క్రిందఁజూచి) ఓహో ! ఏల యిట్లు భూశయ్యపై శయనించియున్నది? కారణ మేమైయుండును ? నాపై కోపగించి యిట్లొనర్చియుండెనా ? (దగ్గరఁజేరి) ప్రియకాంతా ! కాంచనమాలా !

(అనుబంధము 2)

కాంచ—(దిగ్గున లేచి) ఎవరునీవు ? నాసౌధమునకు రాగతమేమి ? ఆవలకుంబొమ్ము.

ప్రతా— కాంచనమాలా! ఏమిది ? యిట్లుబల్కెదవు? నే ప్రతాపసేనుఁడ గానా ? చూఁడు.

కాంచ—నీవు ప్రతాపసేనుఁడవైన నాకేమి లే. పొమ్ము. నేటికిమూఁడు దినములనుండి లేని కాంచనమాల నేఁడుగావలసి వచ్చినదా ? చాలు. చాలు. నీకథయంతయుఁ దెలిసినది.

ప్రతా—ఏమిది ? ప్రేయసీ ! కాంచనమాలా ! నేఁడేమో యింతగఁ బల్కుచుంటివి ?

కాంచ—ఔను ! అంతయు వింతగనేయుండును. రత్నమాలతో స్నేహముఁగూడ వింతగనుండదా ?

ప్రతా—రత్నమాల ! ఎవ్వరు ? స్నేహము ఎవరుజేసిరి ?

కాంచ—ఎవ్వరోయన నేల ? నేటికి మూఁడుదినములనుండియు రత్నమాలాలోలుఁడవై యుండుటెఱుంగమా ! పిల్లికనుమూసి పాలు ద్రావుచుండుట ఎల్లవారు జూచుచునేయుందురు. ఇంక నాతోడ మీకుగావలసినదేమి లే ? పొమ్ము. రత్నమాలయే నీకాంత.

వ్రితా—ప్రాణప్రియా! చెప్పెద వినుము. నేటికిమూడు దినములనుండియు నీకడకు రాకుండుటచే నీకిట్టియూహ గల్గినది. కలిగిన కల్గవచ్చుగాక. నాగురుగారు వచ్చియుండుటచే నాకు రావలను బడినదిగాదు. ఇందులకు వేఱుగినెంచకుము.

కాంచ—రావలను బడని కార్యమేమిజేయుచుంటివి ?

వ్రితా—కొన్నివిషయములు మాటాడవలసి ముచ్చటించుచుంటిమి.

కాంచ—ఏమివిషయములఁ గూర్చి ? నన్నుగూర్చియేనా ?

వ్రితా—కాదు. కాదు. రాజ్యాంగమునుగూర్చి ముచ్చటించుచుంటిమి. నీవిషయ మచ్చట యేల దేవలయు?

కాంచ—నావిషయమై యేమియు ముచ్చటింపలేదా? ఇం దసత్యము బల్కితివి?

వ్రితా—కాదుగాని నీవిట్లుండఁ బాడిగాదు. "వివాహ మొనర్పుకొనుము" అనిఁబల్కినాడు.

కాంచ—అందుల కేమని మారుఁ బల్కితివి?

వ్రితా—నాకు వివాహ మెందుకు. ? వలదని బల్కితిని.

కాంచ—నిజముగ నిట్లుబల్కితివా ? కల్ల. నమ్మఁజాల

వ్రితా—ప్రియ సీ! ఇంకను నాయందునీకు నమ్మకము కల్గలేదుగదా?

చ. కలికి ! మిటారి నామతిని ♪ గన్గొనవైతివినిన్ను బాసి నే
నిలువగనేర్తునే? క్షణము ♪ నిక్కము పెండిలియాడ నింక నిన్
గలసియు సర్వసౌఖ్యముల ♪ గాంచెదనంచు దలంచుచుంటినో
జలజదళాయతాక్షి ! విను ♪ సౌఖ్యము స్వర్గము నీవె నా కిలన్.

రమణీమణీ! నీకన్న నాకెక్కుడు గల వస్తువు నెందుజూచినను గాన్పించదెయ్యో. నిన్నుజూడని నిముస మొక యుగముగనుండును. అట్టినిన్ను బాసి నేఁబ్రతుకఁ గలనా ?

కాంచ—ఏటికిబల్కెదవు ? ఇది నిక్కమా ? ఒకటి దెల్పెదవినుము.

ఉ. కాముకులైనవారు తమ కార్యము దీరినయంత దాని నె

మ్మోమును జూడకుందురను ముందటినుడ్డుల మేమెఱుంగమే?

ప్రతా—

కామిని ! యేలయిట్లనెద ? కాముకులెల్లరు నట్టిజేతురా?

స్వామి యెఱుంగు నామతము భావమునందున వేరు సేయకే.

ప్రాణేశ్వరీ ! నీరూపమే నా కానందము. పరమానందము. బ్రహ్మా నందము. నీకన్న నాకెక్కుడు లోకమెయ్యది ? సర్వకాలసర్వావస్థల యందును నిన్నుదక్క నన్యస్త్రీని బ్రేమించియు దలంచియు నెఱుం గను. ఇంకముందును దలంచను. ఈమాట సత్యము.

(తెరలో) మహారాజా! సలామ్.

ప్రతా—సేవకా ! రమ్ము.

(ప్రవేశము సేవకుడు)

సేవ—మహారాజ్! సలామ్.

ప్రతా—ఏమిరా విశేషములు ?

సేవ- క్యాబీనై మహారాజ్. నిన్న వొచ్చ్యవుండ లేద్ ఓబుఢ్ఢీబులాతాహై.

ప్రతా—నిన్న వచ్చియుండిన దెవ్వరురా? (అని ఆలోచనం జేయును.)

సేవ—తెల్సింది నై మహారాజ్. మోటా లకిడీ పకడ్కే ఆయానీ! బుఢ్ఢీ. ఉనుఆయా. జరూర్సి ఆల్ ఉకో.

ప్రతా—నాకొఱకై ఇప్పుడు వచ్చువారెవ్వరు? సేవకా. ఎవ్వరు తెలి యకుండం జెప్పెదవు.

సేవ—మాలుంనై క్యా. అది అది కాండ కాండ క్యాకి అతానీ అంకు కల్ ఆయానీ బుఢ్ఢీ.ఉను ఆయా. అబ్ మాలుంహై.

ప్రతా—ఓహో ! గురువుగారగు కొండభట్టుగారా ?

సేవ—అ ఉన్ గురు కొండభట్టు.

కాంచ—సేవకా! గురు వైననేమి లావా? యిప్పుడు వచ్చుటకు వలను గాదని దెల్పుము. పొమ్ము.

సేవ—ఖైరో. తుంకు బులాయసీ, క్యా మహరాజ్! ఆతానీ?

ప్రితా—సేవకా! నేనిదేవచ్చెద. నీవు గురువుగారికడకు జని వారికి వలయు సామగ్రులనిచ్చి వానిలయమందే యుండునట్లుఁ జేయుము.

సేవ—అచ్ఛా! (తనలో) కాంచనమాలా సైతాన్ వైసాకరే? అబ్ హం క్యాదిస్తా? ముందు వుండది ముస్సళ్ళవండ్లు. అబి క్యాహై.

(అని నిష్క్రమించును.)

ప్రితా—మనోహారి! కొండభట్టుగారు వచ్చియుండిరి. నేనింక వారి దర్శింపఁబోవలెను. సెలవా? ఇప్పుడే వచ్చెదను?

కాంచ—ఏమి గురువు. నాకన్న నెక్కుడగునా?

ప్రితా—ఎక్కుడైనను గాకున్నను కులగురువుగదా? దర్శింపకుండు టెట్లు?

కాంచ—నీ విప్పుడు పోవలదు.

ప్రితా—పోయిననేమి? ఒక్క నిముషములో వచ్చెదనుగదా? ఏమందువు?

కాంచ—అట్లయిన నేను రెండు సంగతులఁ గోరెద నవి యిచ్చెదనని యానఁ బెట్టి పొమ్ము.

ప్రితా—నీకే వేళనైన నడ్డుజెప్పియుంటినా? సర్వవ్యవహారములయం దును నిన్నే ప్రిధానమానిసిగ నెంచితినే?

కాంచ—అట్లుగాదు. నీగురు వెంతబోధించినను వివాహమున కంగీకరిం చకుము, నీ వట్లొనర్చితివేని నే ప్రాణపరిత్యాగము జేసికొని యెద.

ప్రితా— (పట్టుకొని) ఆ. ఎంతమాట. అటులఁ జేయకుము. నియా జమీారువాడనా? నీవు వలదన్న వివాహ మేలజేసికొందును?

కాంచ—రెండవది నీకుంగల రాజ్యములోని సర్వాధికారము నాకొసంగవలయు.

ప్రతా—అట్లనే యిసంగితి గైకొనుము.

కాంచ—అది మాటలతోంగాదు. క్రియలతోంగావలయును.

ప్రతా—ఐన నేమందువు?

కాంచ—నీ వ్రేలియుంగర మిట్లిమ్ము.

ప్రతా—ఇదిగో గైకొనుము. (అని యిచ్చును.)

కాంచ—అప్పుడే అయినదా? నీవు నేను రాజును, నా యాజ్ఞప్రకారక నీవు నడచుకొనవలయును. ఇందులకు సమ్మతింతువా?

ప్రతా—ప్రాణప్రియా! నీయాజ్ఞకు మారుబల్కుదునా? నీ వెట్లాన ర్పమన్న నట్లనే యాచరించెద. ఇందులకు సందియము లేదు. సెలవా? నిమునములో మరలివచ్చెద.

కాంచ—నేఁజెప్పినది మరచెదవా?

ప్రతా—ఏమది?

కాంచ—వివాహము వలదని.

ప్రతా—నీయాజ్ఞోల్లంఘన మొనర్చి వివాహ మొనర్చుకొందునా? వివాహ మొనర్చుకొన్నను ఇంతకన్న నెక్కుడుసౌఖ్యము గలదా?

(ప్రవేశము: సేవకుడు)

సేవ—మహారాజ్! సలామ్.

ప్రతా—ఏమిరా! మరల వచ్చితివి?

సేవ—ఉన్ బులాతా హైమహారాజ్!

కాంచ—సేవకా! ఆయన ఎందులకు వచ్చినాడు?

సేవ—అంకు క్యామాలుం. ఆయాతో ఆతా నైహితో నైహి. ఫిర్ జాకో బుఢీకు అంతా సెప్తాం. అమార ఖజాన క్యాజా తే?

ప్రతా—సేవకా. రమ్ము పోదము. (నిష్క్రమించుచును).

కాంచ—(ఒకవైపునకు నిష్క్రమించును)

సేవ—కాంచన్ మాలా మాటల్కియిని ఖజానా అంతా ఖరుసుపెట్టి ఫేల్తాహై. అబ్ మాలుం. ఇంతయింత పెద్దరాజుల్కిసూసి ఉండాంలేదు, మాయామాటల్ సెప్తే మాకితెల్వాదు ఏం? అంకుక్యా దస్రూపీ ధర్మవాలాకు బడా యిశారణఎందుక్ కాంచన్ మాలా ఘోక్లే అయ్యగార్కి బుట్టలో పెట్టింది. అంకు సాబ్బిమాలుం కాంచన్ మాలా మిందదుష్మనడ ఉన్ ఖుష్కు ఆకోజాకో బులానేకా. మర్జాతుంరేమె మారాజా యి ఒక ఉంటాహువేం. కాంచన్ మాలా యేసిన ఫంకా పలాస్! రాజుకొంక ఖలాస్.

(నిష్క్రమించును).

---

ద్వితీయరంగము; ప్రతాపసేనుని యాస్థానము.

[ప్రవేశము: ప్రతాపసేనుడు కొండభట్టు]

ప్రతా—ఆచార్యా! ఏలమీకీపట్టుదల? మీరెన్నిచెప్పినను నామనమునకెక్కదు. ఎందుకిట్లు బోధించెదరు?

కొండ—ప్రతాపసేన! వేశ్యకాంత నీకు శాశ్వతమా? పరివారు విన్ననగుబాటుగాదా? కులమున కపకీర్తి రాదా? యశంబు పోదా? వివాహంబొనర్చుకొమ్మని నిక్కచ్చగఁబలుకుటవాదా? చాలు చాలు నీవెడగులు. వివాహంబొనర్చుకొనుము.

(అనుబంధము 3.)

ప్రతా—గురువరా! వేశ్యనుంచుకొనుటతప్పా? ఈ పుడమిపై నెందఱెందఱు వేశ్యాలోలురై యుండలేదు? నీవుమాత్రము నంగనాచివా?

చం. తలయును గడ్డమున్నెరిసి ♦ తాపసిరీతిగ నేటికుంటి వీ
వలబలమున్న యత్తరి వి ♦ టావళివృత్తి వహించలేదె? యా

జలజదళాక్షులన్ గలసి ♦ సౌఖ్యగతిన్ జరియింపలేదె? నేఁ
బొలఁతిని గాంచవా మునిసి ♦ బొంది సుఖించగ యోగ్యవైతివా ?
చాలుచాలు యిట్టిప్రసంగములు నాకడజెప్పకుఁడు. ఇంక నేవిను వాడ
గాను.

కొండ—(తనలో) ఓహో! తొండమాదిరియూసరివిల్లియైనదే. నేను
నీతులుదెల్ప నన్నే నిరాకరించుచున్న వాఁడు. ఇంక నితరులు
దెల్పిన నితఁడు వినునా? (ప్ర) ప్రతాపసేనా! శాంతించుము.
ఇంకనొక్కటిదెల్పెద మనమున యోజించుకొనుము.

ఆ. వారకాంతఁగూడ ♦ వైభవంబేనని
దలఁచుచుంటివీవు ♦ ధరణిలోన
దుర్యశంబు గల్గ ♦ దోయని యోచన
బొడమదయ్యొ నీకు ♦ బుద్ధిలోన;

ప్రతా—అయ్యో! వినుడు. ఆ కాంచనమాల గూటయే నాకు వేదా
తురంబు, దానియాజ్ఞయే నాకుజీవనము గాన దానియనుమ
తిలేక వివాహంబొనర్చుకొనజాలను క్షమింపుడు.

కొండ—ఓయీపిచ్చివాఁడా! వేశ్యమాటవిని వివాహంబొనర్చుకొనని
వెట్టివా డీలోకమునఁగలఁడా? వివాహం బొనర్చుకొనినఁగదా?
పుత్రపౌత్రాదులుగల్గుట? దా వలనఁగదా వంశాభివృద్ధి?
దానివలననేగదా సర్వసౌఖ్యములు? దానివలనఁగదాయశస్సుం
దిక్కులందిక్కులఁబ్రకాశించుట? నీసరిరాజులువిన్న నియెడ
గౌరవముండునా? ప్రజలకు ప్రభుభక్తియుండునా? జన్మంబు
నకుమానాభిమానంబు లుండవలదా? కీర్త్యపకీర్తులు దలంచ
వలదా?

ప్రతా—గురువరా!

ఉ. మానముపోవుగాక యభి ♦ మానధనంబడుగంటుగాక; నా
ప్రాణముపోవుగాక మరి ♦ ప్రాభవమంతయు వీడుగాక నా

భానుఁడు త్రోవఁబోక హిమ ♦ భానుఁడు వేడిమిఁబూనుగాక నా
మానినిపొందువీడుటను ♦ మాట యసత్యము సేయనేటికిన్,

కావున కాంచనమాలతో నేనింక వివాహమాడనని బాసయొనర్చినాఁడ. అట్టివాఁడ నేనెట్లుగా వివాహమాడుదును? మరియు, కాంచనమాల యెట్లుజెప్పిన యట్లువినవలసియున్నది. కాని అన్యథాచరించ వలనుబడను. నాయందు దయయుంచి నన్ను వివాహమాడుమని మీరు నిర్బంధించకుఁడు.

కౌండ—ప్రతాపసేనా! మీఁదెఱుంగక జరించెదవా? పిన్నపెద్దలనిగుర్తెఱుంగక సంచరించువానికి గౌరవముండునా? గురువునగు నా యాజ్ఞఁగూడ నిరాకరించెదవా? నీమేలుకొఱకై యింతగ జెప్పుచుంటినిగాని, వినకున్న నెవరుజెప్పెదరు? నీకన్న ధనాధిపులే వేశ్యాలోలురై నిలువనీడలేకయుఁ గుడువకూడు లేకయు తుదకు సన్యాసులై తిరలాడుచుండిరి. కామాంధకారము కన్నులఁ గప్పుటచే నేమియుందెలియక వెలకాంతమాయకులోనై వఱ్ఱుచుంటివి. ఇప్పటికైనను దెలివి తెచ్చుకొనుము. కులగౌరవము నిల్పుకొనుము. ప్రతాపసేనా! ఈపద్యమువినుము.

ఉ. "ఎవ్వఁడు మీఁదెఱుంగక య ♦ థేచ్ఛ సుఖైకరతిం జరించుఁగా
నవ్వల వంశహాని వ్రిత ♦ హాని యశోధనహాని పుట్టుఁ దా
నవ్వెడ గమ్మనుష్యపశు ♦ వయ్యవివేకి చెడుఁ జగంబునన్
నవ్వుఁగఁబాలు గౌరవము ♦ నంబెసఁబాలును నిందపాలునై"

అను యార్యోక్తి నించుకంత మనమునఁ దలపోయుము,

ప్రతా—ఆచార్యా! మీపట్టుదల విడువరా?

కౌండ—గురువునగు నాయాజ్ఞ మీరిజరించెదవా?

ప్రతా—గురువరా! ఇందులకేమి సేయమనెదరు? నా కాంచనమాలను వీడఁజాల.

కొండ—పోనీ, నీవడుగున్నను సరియే. వివాహ మొనర్చుకొని పిమ్మట వేశ్యనుంచుకొనుము.

ప్రతా—అట్లైన నంగీకరించెద.

కొండ—మంచిది. కానీ సంతోషమైనది.

ప్రతా—కాని, వివాహమునకు మాత్రము నేను రాను.

కొండ—నీవు రాకున్న యింక వివాహ మెవ్వరి కొనర్పవలయు?

ప్రతా—ఈఖడ్గమునకు.

కొండ—ఇట్లొనర్చిన జగము మెచ్చునా?

ప్రతా—మెచ్చిన నేమి, మెచ్చకున్న నేమి? వారుఁ దడవగుచున్నది. ఇదె వెళ్ళెద. (అని పోఁబోవ కొంటభట్టు అడ్డగించి)

కొండ—వత్సా! ప్రతాపసేనా! ఏమి చెప్పితివి?

ప్రతా—చెప్పినది యేమి సర్వమున కీఖడ్గమే?

కొండ—మంచిది. అట్లనే యొనర్చెద.

ప్రతా—ఆచార్యా! మీరు పయనముగండు. మంత్రిచే ఖడ్గమును బంపెద. (నిష్క్రమించును.)

కొండ—ఔరా! ఏమీ వేశ్యలమాయ? ఏమియు నెఱుంగని యీప్రతాపసేనుని యెంత కామాతురునిఁగ జేసెను! ఔను. స్త్రీలవలన గదా లోకమంతయు మోసపోవుటలు? అందు వారాంగనయన్న వేరుగ జెప్పవలయునా?

గీ. దర్శనముఁ జేయు నెమ్మది ♦ తత్తరిల్లు
స్పర్శనమ్మున సంపదల్ ♦ సమసిపోవు
గాన వేశ్యలతో పొందు ♦ మానుడనుచు
వేఁడుచుంటిని యువకుల ♦ వేయిగతుల.

ఆర్యులారా! వేశ్యలన్న గుర్తెఱిఁగి సంచరింపుఁడు. ధనతరుమదాంధతచే విఱ్ఱవీగకుఁడు. (నిష్క్రమించును. యవనిక జారును.)

తృతీయరంగము:- కాంచనమాల సౌధము.

[ప్రవేశము: ప్రతాపసేనుఁడు] (ఆసీనుఁడై) [కాంచనమాల]

కాంచ—ప్రాణేశ్వరా! నన్నుఁజూచి మౌనముఁ జేసితివే?

ప్రతా—నీకేమియు లోటులేదు. భీతి జెందకుము. ప్రియసీ! నాకు నీయెడఁగల సంతసమునకు మితిలేకయుండును గదా? లభించిన వారాంగనలపొందే లభించవలెను.

కాంచ—ప్రాణేశ్వరా! నేఁడు నృత్యగానములచే కొంతకాలము గడుపుదునా?

ప్రతా—నీయిష్టమగునట్లొనర్పుము.

కాంచ—రత్నమాలా! ఏమిచేయుచుంటివి?

(తెరలో) ఏమియు లేదు.

కాంచ—మీరెల్లరు నలంకృతులై శీఘ్రముగ రండు.

[ప్రవేశము: కొందరు వేశ్యలు] (అలంకృతులై యిరువైపులనుండి.)

కాంచ—సఖులారా! నేఁడు మీబావగా రానందించునట్లు నృత్య గానాదు లొనర్పవలయు.

వేశ్య—(అట్లుఁ జేయుచు) (అనుబంధము 4)

ప్రతా—(సంతసమున)

చ. కలికిమిటారి! వయ్యారి! చొకాటపు నాటలపాటలన్ సుధర్
జిలికితొ, తద్రసంబునకు శ్రీముషి సంతసవార్ధి దేలె ని
య్యెలఁగల మోదులంజివురు కెట్టువహించెనొ జూడుమీ సభా
స్థలి జనులెల్ల, ఱాశిలలకెచందముగాఁ గనుపట్టి రిత్తరిన్.

(దగ్గరకుఁ జేర్చుకొని ముద్దిడుకొని) ప్రియకాంతా! నిక్కముగ నీవమరలోకమున దేవవేశ్యవై జనింపవలసినదానవు. నాపూర్వపుణ్యా వయః పరిపాకముచే నన్నుద్ధరించ నీలోకమున జన్మించితివి. ఆహా! నేనెంతకృతార్థుఁడ. ఎంతధన్యుఁడ. ఎంతపుణ్యుఁడ. నాకు జనించుచున్న

యానందమునకు నీవుగదా మూలంబవు? ప్రియా! నాయానందమును భరింపఁ జాల. సఖులారా! మీరింకఁ బోండు. మీకువలయు పారితోషికము లొసంగెద లెండు.

[వేశ్యలు క్రమముగా నృత్యముఁ జేయుచునే నిష్క్రమింతురు.]

కాంచ—ప్రాణప్రియా! నృత్యగీతాదులేమైన రుచించినవా ?

ప్రతా—రుచించినవా యని బల్కనేల? రుచించుటయగాదు. అందలి రసమును గ్రోలితిని. ద్రాక్షామరందేక్షుఖండశర్కరలకన్న నెక్కుడు రుచ్యమై మనము నకానందమొసగెను గాని యింక మనము లోనికి బోవుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

[ప్రవేశము: సేవకుఁడు. కాంతామతి చిత్రపటముతో]

మహారాజ్, అందర్ కు ఆనా ?

(తెరలో) ఎవడురా? అచటనే యుండుము.

[ప్రవేశము: కాంచనమాల.]

ఓరీ! నీ కేమియు పనిపాటలు లేవా? ఏమివచ్చితివి ? శీఘ్రముగఁ దెల్పుము.

సేవ—అరె మహారాజ్ కు బులావ్. జా. తుంకు బులాయానీ.

కాంచ—ఓరీ! మీరాజెవరో ఎఱుంగుదువా! నే నే.

సేవ—కాంతామతి అమ్మోడు ఆయంక నే బోల్. జా.

కాంచ—సేవకా! కాంతామతి యెవ్వరు! ఆచిత్రపట మామె దేనా? ఏదీ చూతము.

సేవ—మహారాజ్ జోరు. మాలుంనీక్యా. (తనలో) తుమార్ మూమే మాటి ఫడేలేవ్. ఏదెకో అమ్మోడ్. (అని చిత్రపటమిచ్చును)

కాంచ—ఆహా! ఏమి యీమె యందచందములు? భువన మోహిని యన నీమెకే చెల్లును. ఈతఁడు యీమె సుందరవదనారవిందముఁ దిలకించిన ఇంక నాపై భ్రాంతిపడునా ? అక్కటా!

వాగతి యెయ్యది? సేవకా! నేనుఁ దెల్పెదనులే పొమ్ము.

సేవ—ఎక్కడపోవాలమేం. జాకోబోల్ బె. నైతో అందర్కూపై జాతా.

కాంచ—సేవకా! నీవిచ్చటనే యుండుము. (పటముఁజూచి) ఔరా! ఏమి యీమెయాకృతి. ఈపటము సిల్పైగెకాని యీకాలనికిఁజూపిన వారు శుభముగల్గదు. ఈపటమునఁగల కాంతామతి నేత్రమునకు నున్న పుచుక్కనడి ఎరూపినిగఁజేసి చూపి "అడక యాడక నంధురాలినిఁ బెండ్లియాడితివా?" యని హేళనఁ జేసెడగాక.

[నిష్క్రమించి ప్రతాపసేనునితో పునఃప్రవేశము.]

ప్రతా—ఔరా! గురుఁడెంత క్రూరచిత్తుఁడు?

గీ. వలదు వలదన్న కృత్రిమ ♦ వాక్యములను
నాడి, యిటుచేసె గురుఁడిదె ♦ యంధురాలి
నేమిచేసిన గసిదీరు ♦ నిప్పుడతని
క్రూరచిత్తుఁడు! మూర్ఖుఁడు! ♦ గురుఁడువాఁడె.

ప్రియకాంతా! వాని నేమి సేయుమనెదవు? వలదన్న బలిమిని పెండిలిజేసినాఁడు. చేసెనుపో. అంధురాలినా జేయుట. ఈ యంధురాలిని గురువును ఏమిసేయుమనెదవు?

కాంచ—ఏమియు వలదు లెండు. శాంతించుఁడు.

ప్రతా—శాంతి? ఇంకెక్కడి దాశాంతి.

కాంచ—పోనిండు. కాంతామతి రాచబిడ్డగుటచే యామెను గౌరవముగ కారాగృహమందుంచుడు. గురువగు కొండభట్టునకు ముండనముఁజేయించి ఖరముపై నెక్కించి యుత్సవముఁజేసి దేశభ్రష్టునిగఁ జేయుఁడు,

ప్రతా—మంచిది. సేవకా! నీవు సత్వరముజని కాంతామతిని కారాగృహమందుంచుము. గురువును దేశ భ్రష్టునిగఁ జేయుము? పొమ్ము.

సేవ—మహారాజ్! మాకీ తెల్సింది లేదు.

కాంచ—ఏమి తెలియలేదా ? కాంతామతిని మొదట కొట్లో బెట్టుమని చెప్పినారు, పిమ్మట గురువును, తల గొరిగించి గాడిదపై నెక్కించి యూరేగించి వెళ్ళగొట్టుమని చెప్పినారు. ఇప్పుడు తెలిసెనా ?

సేవ—ఆ. (తలయూపుచు) మాకీయిప్పుడు తెలుస్తాదియేం, ముందుండది ముసెల్లి కుండ్గ అబి క్యా హై. మహారాజ్! క్యాహుకుం ?

ప్రతా—ఏమిరా ! కాంచనమాల చెప్పియుండలేదా ? అట్లేయొనర్పుము.

(అని యిరువురు లోనకుఁ బోవుదురు.)

సేవ—కాంతామతి అమ్మోడ్కి భోత్ కష్టంఆయా. హాయ్, అల్లా. కాంచనర్ మాలా సైతాక్ కాపీ అయారే ? మహారాజ్ హుకుం సె హ్యాల వొద్దు మల్లీమేం కాంచర్ మాలా మాటల్కియిని పెళ్ళాంగుడ్డిది అంటాసెప్తాను. కాంతామతి అమ్మోను కాల్కింది మట్కివస్తదియేం కంచిని మాధర్ ఛోద్ ఛోక్ర,

(నిష్క్రమించును యవనికజారును.)





శ్రీరస్తు.

# కాంతామతి

## ద్వితీయాంకము

### ప్రథమరంగము: కారాగృహము.

[ప్రవేశము. కాంతామతి కారాగృహములో]

(అనుబంధము 5.)

హా! దైవమా! నేనేమియపరాధ మొనర్చితిని? నన్నిట్లీ కారాగృహమందు నిర్బంధించనేల? పరిణయమైనదాది నేటివఱకును నామోమైనజూడలేదే? పోనిమ్ము. నాథా! నేనపరాధినైన పుట్టినింటికిఁ బంపరాదా? లేకున్న నెందైన వేరుగనుంచగాదా? తా మొనర్చు కార్యముల కేమైన నడ్డుకొంటినా? వేశ్యాలోలురై, అగ్నిసాక్షిగ వివాహమాడిన నన్నుఁ గన్నులనైనఁ జూడక నిష్కారణముగ కఠిన శిక్ష విధించితివే? అయ్యో! నేనెంతపాపురాలను? ఓ కాంచనమాలా! నీ వెంతపూజ్యురాలవు? స్త్రీవైన నాయెడ దయరాదా? అయ్యో! ప్రాణకాంతుఁడే యిట్టి ఘోరకార్యమునకుఁ బాల్పడ వేశ్యాంగనవగు నీకుమాత్రమేల కనికరము గల్గును? అక్కటా! పూజ్యుండును, పితృసమానుఁడును, కులగురువును నగు కొండవభట్టు గారికిఁ గూడ నెట్టిచెట్ట సంభవించినది? అయ్యో! నా గ్రహచారమా!

సీ. వెలకాంత నటుగూడ ♦ కులకాంత నిటువీడ
యాళమ్మనిదోఁచెనా? ♦ వసుమతీశ!
కులగౌరవంబెల్లఁ ♦ బలుచనౌ ననుచని
మదిలోఁ దలంచవా? ♦ మనుజనాథ!
సాటివారలు విన్నఁ ♦ జౌకఁజూతు రటంచుఁ
దలపోయకుంటివా? ♦ ధన్యమూర్తి!
బంధుమిత్రులమాట ♦ పాటించవైతి వ
య్యాదిగాక తప్పుగా ♦ నరసితయ్య!

గీ. ఏమి యపరాధ మొనరించి ♦ తిప్పుడేను
మదికి నూతైనఁ దోఁచదో ♦ మాన్యచరిత!
తప్పుగున్నను మన్నించి ♦ దగుదు నన్ను
రక్షణముఁ జేయ వేఁడెద ♦ రాజమౌళి!.

అయ్యా! కొరనోములు నోచి నెక్కడు ఫలముర మ్మన్న వచ్చునా? నావంటి పాపురాలు బ్రతికి బుట్టినింటికి మెట్టినింటి కిని నపయశముఁ దెచ్చుటకన్నఁ జచ్చుట మేలుగదా? హా! ప్రాణప్రియా! బ్రతాపసేనరాజేంద్రా! నన్నేలయిట్లు నిర్బంధించెదవు? నాకడ నేరమున్న మీ ఖడ్గముచేఁ దునుమఁగరాదా? మీకు సౌఖ్యమును, నాకు స్వర్గమును గల్గునుగదా?

[ప్రవేశము; సేవకుడు.]

అమ్మాడ్ బోత్ రోతే, హై క్యాకర్తా? మహారాజ్ హు కుం. అమ్మా! క్యాకర్తే. కైకురోతే, రోనాకో. ఇదిఖూచారం.

కాంతా—సేవకా! నే నేమి యపరాధ మొనరించితిని? అన్నా! నీవా కాంచనమాల కడకేగి యిట్లుబల్కుము. "అమ్మా కాంచనమాలా! నాయెడ దయయుంచి ప్రాణేశ్వరునకుఁ జెప్పి నానిర్బంధవిమోచనము గావింపుము తల్లీ! నీకు నేను సేవ

కావృత్తి జేసెద. నీమేలు మఱవఁజాల. నా యాభరణము లన్నియు నొసంగెద" నని చెల్పుము. పిమ్మట ఆమెదయ యెట్లుండునో?

సేవ—అమ్మా! వైసాబోలేకో మహారాజ్ ఫిర్ క్యా దండన సెప్తా డో, మైజాతానీ సలామ్ కర్తా.

కాంతా—అన్నా! నీకీచంద్రహారము నొసంగెద. మహారాజు వినకుండగ రహస్యముగ నాకాంచనమాలతో "మిగుల దుఃఖించుచు నిట్లు బల్కుమనె"నని నుడువు. యాతండ్రీ! నీకుపకారము నరించెద.

సేవ—ఓహూధర్ చోద్ కంచీ ఫిర్ ఓజాతాసుంతా. మరొక్కఫిర్ మహారాజ్ బోల్తానీ ? పిచ్చిఅమ్మా ? ఎక్కడమాటల్ సెప్తావును కాంచన్ మాలాఅంటె నీకె తెల్వాదు. కొంపల్ కొంపల్ మింగియేస్తాది.

కాంతా—అన్నా! అయినఁ బోయిరమ్ము. నాప్రాప్తమెట్లుండునో? యిదిగో! చంద్రహారముఁ గైకొనుము. (అనియిచ్చును.)

సేవ—(హారముఁదీసికొని) అచ్చాజా తేలేవ్ అమ్మా ! (పోవుచు) మంచిహారం మాకీచిక్కిందిఅండీ, ఇట్టాసిక్కాల మాకీ లేక్ పోతె పదియాపాల్ జీతంమీద పెళ్లామిక్క బిడ్డల్ కి ఎట్టాబతికిచ్చాల మల్లీమేం. (నిష్క్రమించును.)

కాంతా—అయ్యో! దైవమా! తుదకు నాగతి యెట్లయినది. నాప్రాణకాంతునిఁ గనులారఁగని యోటుంగకుండఁగనే యిన్నియగచాట్లఁ బెట్టితివా ? హా ! నే నెంతపాపురాలను ?

సీ. పతి రూపమానుజాని ♦ యతిసమ్మదంబుతో
నుండెడి భాగ్యంబు ♦ పండదయ్యె
కాంతు సేవలొనర్చి ♦ ఘనయశంబందెడి
పున్నము నాకింక ♦ పుట్టదయ్యె

నాథుని చెంగట ♦ నామముచ్చటల్ జూడఁ
గోరినకోర్కె చే ♦ కూడదయ్యె
ప్రియుని ముఖముఁజూచి ♦ ప్రీతినుండగఁజాలు
నంతయదృష్టంబు ♦ నమరదయ్యె
గీ. అక్కటా! యెట్టిపాపినో ♦ యిక్కటులిల
నందుచుంటిని కారాగృ ♦ హంబునందు
నిమ్మనగనేలనయ్యా! నా ♦ ఖన్మదేవ
రిల్లు: నానిమ్మవ్రాసె న ♦ దెట్లుగడతు.

అక్కటా! కాలమా! ఎట్టిమార్పులఁజేసితివి, లెక్కలేని సఖీజనంబుల గలసి సంతసముగ నుండు నేనీ కారాగృహమం దేకాకినై నిద్రాహారంబులు లేక దుఃఖించవలసెనే? హా నాథా!

(మూర్ఛిల్లును యవనికజారును.)

ద్వితీయరంగము:—కాంచనమాల సౌధము.

[ప్రవేశము.—కాంచనమాల, ప్రతాపసేనుఁడు శయనించి]

(అనుబంధము 6)

కాంచ—ప్రతాపసేనుడు కీల్బొమ్మవలె నాచే జిక్కినాడు. ఈరాజ్యమునందును, తనయందును, తనయింటియందును వేయేల? సర్వ వ్యవహారములయందును సర్వాధికారములనుబొంది యీతనినొక సన్యాసిగఁజేసి కూర్చుండఁబెట్టితిని. ఇంక నాకేమి కొరంత? ఈతని ధనమంతయులాగి నిలువఁజేసితిని, ఈధనముచేనాసంతతివారు పదితరములవఱకు కెంతవెచ్చఁబెట్టినను దఱుగదు. ఆహా! ధనముగడించుమార్గమన్న వేశ్యలదే కదా!

చ. పటుల గృహంబు జేర్చుకొని ♦ వేయివిధంబుల వేషభాష లం
పటులనుజేసి పైఁబయిభ్రి ♦ మల్ గనుపర్చి ధనంబు సర్వముఁ

జిటికలోలాగి నిర్ధనికు ♦ నిందగఁజేసియు దత్త యొక్కటిఁ
దిటవుగఁజేతికిచ్చిమరి ♦ ద్రిప్పటఁజూడరె ? వేశ్యకాంతలుౘ.

వేశ్యకాంతలఁగూడి బాగుపడినవాఁడీలోకములో నెవ్వఁడుండెను? మాన్యములమ్మియు, అగ్రహారములమ్మియు, రాజ్యములమ్మియు, గృహములమ్మియు, వెలకాంతలకుఁ బెట్టి యెందఱు సన్యాసులు గాలేదు?

[ప్రవేశము:—సేవకుడు]

కీర్తన.

"దోసుకునే ధానా—నీకీ దోసంలే దేదాంగధానా।
దైవకటాచ్ఛం తర్లిపోతది—ధంచునామీద శానా"

మహారాజ్! యెక్కడవుంది ? (మీదికి హాస్యముగఁజొచ్చును).

కాంచ—ఓరీ! ఏమిమాడినది. ఇట్లు పైఁబడఁజొచ్చెదవు?

సేవ—నై లేబోలో.

కాంచ—ఓరీ! రాజుగారి నిప్పుడేమి పనిగల్గినది ?

సేవ—సునో కాంతామతి అమ్మాఁడ్ భోత్ కష్టంలోవుంది. జైల్మె రోతేహై. నీకీప్యార్థిచ్చి "జైల్కా నాకీ యుడిపిచ్చు అమ్మా! నీకీ కాల్కా మొక్కుతా" అని యేడుస్తావుంది. మహారాజ్కీ జల్ది బోలోజి. పాపం.

కాంచ—కాంతామతి తన ప్రాణేశ్వరునకుఁ జెప్పి తన కారాగృహవాసముఁదప్పింపుమని ప్రార్థించి నమస్కరించినదా? కల్ల. నమ్మజాల.

సేవ—నై అమ్మా! అంతా సత్తెం. సితోడు మట్టితోడు. బోలు జా, రోతేఅమ్మా!

కాంచ—సేవకా! నే నిదివఱకే ఆయనకు జెప్పియుంటిని. నామాట వినఁడయ్యె. నే నేమి సేయుదును? అనేకవిధముల బ్రతిమాలి కూడ జెప్పితిని.

సేవ—తుమారే ఖాతా సుంతానీ ? సంగనాచిమర్యా ! బోలో జా.

కాంచ—ఐన మరలఁ జెప్పెద. నీ విచ్చటనే యుండుము.

సేవ—అచ్ఛా. జావ్. (ఒకచంకకేగి నిలిచియుండును.)

కాంచ—(ప్రతాపసేనునిలేపి) ప్రాణేశ్వరా ! వింటిరా? దుర్మార్గురాలగు కాంతామతి మిమ్మును నన్నును మిగుల నాడిపోయుచున్నదట. మీకు భార్యయగుటచే మిమ్మాడిపోసిన పోయెగాక. నన్నేల నాడిపోయవలయు? నాకును దానికిని యేమిసంబంధమున్నదని ? నీభార్యచేఁ దిట్టించుటకా నన్నుఁ జేరదీసితివి? హా ! ప్రాణేశ్వరా ! నే నింక జీవించజాల. ఎందైన దుమికి ప్రాణములఁబాయుదాన. నాకింక సెలవొసంగుడు. (అని యేడ్చుచు) నాథా ! ఇంక నన్నువీడి నీభార్యనే గూడియుండుము. నాకును నీకును నేటితో ఋణము దీరినది.

ప్రతా—ప్రియకాంతా ! దుఃఖింపకుము. (కంటినీరు దుడుచుచు) ఐన దాని నిప్పుడేమి సేయమందువు ?

కాంచ—(కోపముతో)ఏమిచేసెదరో నేనెఱుంగను కనికరించి కామించినను సరే. లేక కాననమ్మున కాలబెట్టినను సరే. ఇంక నన్నడుగకుఁడు (పెడ ముఖముఁబెట్టును.)

ప్రతా—ప్రేయసీ ! ఇదంతయు నీకెవ్వరు దెల్పిరి ?

కాంచ—ఎవ్వరో యననేల? సేవకుఁడే? ఇందేయున్నవాఁడు. వలయునేని సర్వము బల్కించెద. పిలతునా? వాని.

ప్రతా—నిజముఁ దెలిసికొందము రమ్ము.

కాంచ—వినుఁడు మీరేమియుమాటాడవలదు. సర్వము వానిచే నేనే జెప్పించెద. మీరు మారుబల్కిన కార్యము చెడును. మీయెడలగలభీతిచే వాఁడు తారుమారు గాగలడు. మీ రూరకొనవలయు. ఇందుల కంగీకరించెదరా ?

వ్రితా—అంగీకరించకేమి, నీమాటకు విరారుదునా ?

కాంచ—అట్లైనరండు. (ఇరువురు ముందుకువచ్చి)

కాంచ—సేవకా ! ఇటురమ్ము. కాంతామతి కారాగృహామందుండి యేడ్చుచుండుటలేదా ?

సేవ—నిజం. నిజం.

కాంచ—నీవు నాతోడఁ జెప్పినమాటలెల్ల అబిడ వల్కినదా లేదా సత్యముఁ జెప్పుము.

సేవ—మాకీ అబద్దం సెప్పాలఅని ప్యాణంమీాద వచ్చింది యేం.

కాంచ—ప్రాణేశ్వరా! వ్రిత్యతముగ వింటిరిగదా? పైనిమీాయిష్టము.

వ్రితా—సేవకా ! అంతయు నిజమా ?

కాంచ—(వ్రితావసేనుని చాటునకుఁబోయి చెప్పుమని సేవకునకు సైగ జేయును.)

సేవ—ఓబాతా సొబ్బి సచ్చి మహారాజ్. మాగడ్డముతోడఁ.

వ్రితా—అట్లయిన గూాదుర్మార్గురాలిని యరణ్యములపాలు జేసిరమ్ము పొమ్ము. ప్రాణేశ్వరీ! రమ్ము (అని లోనికిఁబోవును.)

కాంచ—(పోవుచు) ఇప్పటికి నాకోర్కె దీరినది. ఇంతవఱకును తన భార్యమోహముఁజూడకయే నేఁ జెప్పినట్లు జరించుచున్నాఁడు. నిజముగ నీతఁడు భార్యఁజూచియున్నచో నన్ను గౌరవించునా? అందులకే నేనిట్టి యన్నుగడఁ బన్నినది. నేనాతని హృదయక్షేత్రమందు మాయాబీజము నాటుచు నేయుంటిని. నేనాటిన బీజమెల్ల యంకురించి వృద్ధినొందుచునే యున్నది. ఇదియు చక్కగ వృద్ధి నొందినది. వేశ్యల మర్మములు దెలియ నెవ్వరి తరంబు ? అరచేత వైకుంఠముఁ జూపు టెఱుంగరో?

(నిష్క్రమించును యవనికజారును.)

సేవ—హాయ్. హాయ్. యింతమాయల్ సేసి మసిపూసి పోయింది. రాజా అచ్ఛాఆద్మి హైతో నైసాఖేత్తే? మాదర్ చోద్ కంబిని కైసా బోలేతో వైసానుంతె. ఫున్ క్యాకరేబిరాజా. అబి క్యాహై? ముందువుంది ముసళ్ళపండగ. (నిష్క్రమించును.)

తృతీయరంగము.—అడవి.

[ప్రవేశము.—కాంతామతి, సేవకుఁడు]

(అనుబంధము 7)

అయ్యో! పుట్టుపుడకు నాగతియిట్టులయ్యె? యెట్టి దుష్టపాటు సంభవించునని కలనైనఁ దలంచితినే? మహారాట్కుల సంజాతనై రాజాధిరాజ సార్వభౌముఁడగు ప్రతాపసేన రాజేంద్రునకు రాణినై రాణివాసముండుటకు మారు వనవాసమాయనే? హా! హతవిధీ! హా! ప్రాణకాంతా! ప్రతాపసేన రాజేంద్రా!

సీ. వేశ్యమాయకు జిక్కి ♦ విటకాండ్రతోఁగూడు
బుద్ధి మీ కెవ్విధిఁ ♦ బుట్టెనయ్య!
పుట్టెఁబో గురుమాట ♦ పట్టివినియు మీర
లరయకేటికి బెండ్లి ♦ యాడిరయ్య!
పెండ్లియాడినదాది ♦ ప్రేమ నన్ జూడక
నెడబాసియుంట మీ ♦ కేలనయ్య!
యెడబాసినను నరే ♦ వడరానిపాట్లకై
వనభూములకుఁ బంపఁ ♦ బాడియయ్య!

గీ. పాడియైనను హర్షమో ♦ భాగధేయ
నింద మీకిది తగదని ♦ కుందుచుంటి
వేశ్యమాటల విననేల? ♦ వెతలివేల?
మీకరాసిని తలఁదీయ ♦ మేలు నాకు,

హా! దైవమా! నాకింక పతి సుందరవదనారవిందముఁ జూచుభాగ్య మబ్బునా ? అదియేకల్ల.

సేవ—అమ్మా! రోనుకా. కైకురోతే. కాంచన్ మాలా సైతాక్ వై సాకరే. తుమారాసమీబ్ మె అల్లా హైసాలిఖే. క్యాకర్తె ?

[ప్రవేశము ,—ఉత్తమశీలుఁడు ఒకవైపున]

ఈమె యెవరై యుండును? ఈమె రూపలావణ్యముఁ జూడ మహారాజ్ఞుల సంజాతివలెఁ గన్పడుచున్నది. ఐన వెంటనుండిన వీని నడిగి తెలిసికొనియెద.(సేవకుని చేసైగచే బిలచి చెవులో నేమొ చెప్పును.)

సేవ—ఓ మాటల్ మాకీ పనికిరావు. లచ్చల్. లచ్చల్ గావాలా.

ఉత్త—సేవకా! నీకు ద్రవ్యాపేక్షగలదేని యట్లనే యొసంగెద. ఎంత ధన మిమ్మనెదవు ?

సేవ—(చేతి వ్రేళ్లఁజూపుచు) లచ్ఛల్ లచ్ఛల్ లాలేపి!

ఉత్త—అట్లుగాదు. ఒకలక్ష నిచ్చెద.

సేవ—హైతో జల్దీ దేవ్ జాతుంమై.

ఉత్త—ఐన రమ్ము.ద్రవ్యమిచ్చెద.

సేవ—జాంగి చెలో. (నిష్క్రమింతురు)

కాంతా—హా! దైవమా! వీర లేది యో రహస్యాలోచనఁ జేసినారు. వీరి యాలోచనచే నాకేమియు ముప్పుగల్గునుగదా?

[పునఃప్రవేశము, ఉత్తమశీలుఁడు, సేవకుఁడు]

సేవ—అమ్మా! ఈన మహారాజ్. యీన యింటికియెల్లిపో?

కాంతా—అయ్యో! సేవకా! నట్టేట ప్రుట్టిముంచినట్లు నన్నీయువకుని కొసంగితివా? ఇంక నాగతి యేమి?

సేవ—ఫర్వానై ఫర్వానై. రోనాకో (ఉత్తమశీలునితో)మహారాజ్! పిఠారా శిర్మె రఘోజాతా (పెట్టెనెత్తుకొని) తల్లిబిడ్డముల్లె సూడాలమల్లి జాతుం (పోవుచు తనలో) మహారాజ్! భోత్ పైసా

దియ్యా. బడా సంతోష ఆయా. (నిష్క్రమించును)

ఉత్త—కాంతా! రమ్ము. నాగృహంబునకుఁ బోవుదము.

కాంతా—అన్నా! నీగృహంబున కేలరావలెను?

ఉత్త—లక్షరూప్యంబులిచ్చి నిన్ను కొనుక్కొంటినిగదా?

కాంతా—(తనలో) కట్టా! ఎంత ఘోరము జరిగినది. ఓరీ! దుర్మార్గా! సేవకా! ంతకార్య మొనర్చితివిరా? (ప్ర) అన్నా? ఇట్టికోర్కెనుగోరక నీమార్గమున నీవుబొమ్ము.

ఉత్త—ఏమి? ద్రవ్యమిచ్చించి నిన్నుంగొని నాదారిని నేనుబోవలెనా? ఎక్కడికిలోయెదవు? (అని పట్టుకొన బోవును.)

(అనుబంధము 8)

కాంతా—(తప్పించుకొని)

గీ. పరునికాంతను గోరుట ♦ పాపమనుచు
నెఱుఁగవా? మూర్ఖ!యిదినీకు ♦ పరువుగాదు
నీదుభార్యను, సైదోడ్ల ♦ నెగడిపరులు
బట్టనెంచిన హితమానె? ♦ పాపి! చెనటి!

ఉత్త—లోకమోహినీ!

సీ. మానినీమణి! మోవి ♦ మధురసం బానిన
దాక్షారసము వేరె ♦ ద్రావవలెనె!
చంచలాక్షిరో! నీదు ♦ చన్నవఁ బట్టిన
హేమగిరుల్ వేరె ♦ వెదుకవలెన?
ముద్దులగుమ్మ! నీ ♦ ముఖమండలముఁజూడ
వందువెన్నెలలోన ♦ నుండవలెనె?
కలికిరో! నీమేని ♦ కాంతులఁ గనుఁగొన్న
కాంచనలతలను ♦ గాంచవలెన?

గీ. అంబుజాక్షిరో! నీయూరు ♦ కాండములను
జూడ నారంభతరువులఁ ♦ జూడవలెనె?
కుందరదన! యీాదటనిన్నుఁ ♦ గూడియుండు
సౌఖ్యమునమించునదె స్వర్గ ♦ సౌఖ్యమైన.

తరుణీ! ఇంకజాగొనరించక నామనోరథముఁ దీర్పుము. (పట్టుకొనబో వును.)

కాంతా—(తనలో) అయ్యో! దైవమా! ఇంక నేనేమిసేయుదును? వీడు కామాతురుండై నన్నుఁబట్ట సాహసించెనే? (పై) అన్నా! నామనవి వినుము, పరనారులఁ గోరుట పాతకంబు కాదా? మరి యు రక్తమాంసభూయిష్ఠంబగు నీతనువును వేవిధంబుల గొర వ వస్తుసమితితో సరిఁ బోల్చి వర్ణించెదవు. బుద్ధిమంతుడవగు నీకిది చెల్లునా? నేనొకటిఁ జెప్పెద వినుము.

సీ. బంగరు కలశముల్ ♦ పాలిండ్లటనియందు
దుర్మాంసయుతమైన ♦ తుండ్లు కావె?
సరసిజాతములు లో ♦ చనములటందురు
పుసిగారు ముఖములో ♦ పుండ్లుగావె
బింబఫలంబు లే ♦ పెదవియంచనియందు
దిగువనెత్తునితోలు ♦ తిత్తిగాదె?
హార్యతమును కొన ♦ టంచసి యందురు
నడయూడు నన్నని ♦ నరముగాదె?
గీ. శుకపికధ్వనులందురి వ ♦ చోరచనల
నట్టులోనుండి గూసెడు ♦ గుట్టుగాదె?
మేల్మిబంగరు నిగ్గని ♦ మెచ్చుకొందు
రయ్యయో! యిదిమాయగా ♦ యమ్మగాదె?

అన్నా! నీకునునాయట్టితోఁబుట్టువు లుండియేయుండిరి, వారివలె

నన్నుంజూ ఁడుము, నీకు నమస్కరించెద. నాయొక్క సోదరీవాత్సల్యముంచి నన్ను వీడిపొమ్ము, చెరఁగొడ్డి వేడెద.

(అని పెడముఖముఁబెట్టును)

ఉత్త—తల్లీ ! సుగుణవల్లీ ! నీవు చెప్పిన నీతిచే నాకుఁ బుద్ధివచ్చినది. నేటినుండియు నిట్టి దుర్బుద్ధియూని పరసతులఁ దల్లులుగ నెంచి మెలంగెద. ఇంక నాపై నేరముంచక క్షమింపుము,

(అని కాళ్లపైఁ బడును.

కాంతా—అన్నా ! లెమ్ము నీకు శుభమగుఁగాక.

ఉత్త—తల్లీ! ఒక్క మనవి. నీపై భ్రాంతిచే ద్రవ్యమంతయుఁ గోల్పోతి నింకుల కేమి సెలవు ?

కాంతా—అయ్యా ! నీధనమంతయు పోయెనని చింతింపకుము. నీధనమునకుఁ బదిరెట్లెక్కుడగు నొక యంగుళీయకము నాకడఁ గలదు దానిని నీకొసంగెదఁ గైకొని నీఋణవిముక్తిఁ జేసికొనుము. ఇదిగో ! (అని పెడముఖముతో నిచ్చును.

ఉత్త—(తీసికొని) ! అమ్మా ! ఇదినాకడఁ జెల్లునా ? దీని నింత వెల కెవ రంగీకరించి స్వీకరింతురు ?

కాంతా—అయ్యా ! సందియమేల ? రాజాధిరాజులు గ్రహింతురు.

ఉత్త—అట్లయిన నీ యుంగరము రొక్కరూపక మగువఱకు నీ వట్టణమునం గలసత్రమందుండుము. నే దీని విక్రయించుకొని వచ్చెద. నీకేమియు భయము లేదు. పోవుదము రమ్ము.

(నిష్క్రమించును)

కాంతా—(పోవుచు) దైవమా ! ఇంక నా కెట్టియాపదఁ గల్గఁజేయ నెంచితివి ? సర్వేశ్వరా ! సర్వమునకును భారకర్తవు నీవని నమ్మియుంటిని. తుద కెట్లు జేసెదవు నరే. (అని నిష్క్రమించును.

(యవనిక జారును.)



శ్రీ

# కాంతామతి.

## తృతీయాంకము



ప్రథమరంగము—మహాపాతకపురములో దుర్బుద్ధి యాస్థానము.

[ప్రవేశము: దుర్బుద్ధి—అనృతవాది, మహాపాపి అను మంత్రులు

దుర్బు—

ఉ. క్రూరదనంపుఁ జేష్టలకు ♦ గోవిగుఁడీతఁడటంచు లోకుల
య్యారె! నుతించుచుందురు మహీ ♦ యాదగ నీ భువనంబులెల్ల నా
పేరువినంగ బెగ్గడిలు ♦ బెబ్బులి పోలికి నడ్డులేక న
వ్వారిగ రాజ్యపాలనము ♦ వాంఛదలిర్పఁగఁ జేయుచుంటిగా.

సచివరా! అనృతవాదీ! ప్రజలేమనుచుండిరి?

అనృ—నోరెత్తుటకు వీలున్నదా? మీయాజ్ఞచొప్పున ప్రజల నందఱ సాధించి, వేధించి, బాధించుచుంటి. మీశాసనం బతిక్రమించ నే నెంతవాఁడను? ఇది రాజశాసనము గదా?

దుర్బు—అనృతవాదీ! నీయట్టి సచివపుంగవుండు గల్గ నాకేమికొఱంత? ఉండిన నీయట్టి మంత్రియే యుండవలయును.

అనృ—చిత్తము! అంతయు తమయాజ్ఞయే గదా?

దుర్బు—మహాపాపీ! నీకార్యములెల్ల వినుదిక ప్రధానముగ నెంచి యాచరించుచుంటివా?

మహా—ఇట్టివిషయము నాకు మీరు దెల్పవలెనా? నా నామధేయమే నేనొనరించు కార్యములఁ దెల్పునుగదా?

దుర్బు—నిండా సంతోషమైనది. మరచితిని. కులకాంతలబట్టి వెలకాంతలవలె నిర్బంధించుచుంటివా?

మహా—నిర్బంధించుటయుగాదు. నన్నుంగాంచిన నారీమణులు బర్వులెత్తి యేమూలనో దాగుచుందురు. అట్టివారింబట్టి వెలికీడ్చి నాయిచ్చవచ్చినట్లొనర్చుచుంటిని. అందుచే ప్రజలెల్లరు నన్నుంజూచి పై కేమియు ననఁజాలక లోలోన నేమేమో యాడిపోసికొనుచుందురు. కాని నేననిన ప్రతివారికి గుండెదిగులు ప్రాణతల్లటముగ నేయున్నది.

దుర్బు—సచివచంద్రమా! నీవుగదా యీదుర్బుద్ధి మహారాజునకు మితిలేని యానంద మొనఁగజేయుచుంటివి. మంత్రియన నిట్లుండవలయు.

మహా—ఇదంతయు తమ కరుణయేగదా?

దుర్బు—మంచిది.

[ప్రవేశము సేవకుఁడు.]

మహారాజా! యెవ్వఁడో యొక వర్తకుఁడట. తమ్ము దర్శింపవచ్చియున్నవాఁడు సెలవా!

దుర్బు—మంచిది. ప్రవేశపెట్టుము.

[సేవకుఁడు నిష్క్రమించి, పునఃప్రవేశము ఉత్తమశీలునితో]

ఉత్త—మహారాజా! వందనము. (నమస్కరించును.)

దుర్బు—ఓయీ! నీ వెవ్వఁడవు? ఏమి కార్యార్థమై వచ్చితివి?

ఉత్త—నాకడనొక యుంగరమున్నది. దాని రొక్కముగ మార్చుకొనవచ్చితిని. మీరు వలయునేని దీని గ్రహించి ద్రవ్యమొసంగుఁడు. (అని యిచ్చును)

దుర్బు—(తీసికొని చూచి) చేరీ ! ఇది నీకెచ్చట లభించినది? స్త్రీలు ధరించుదానివలె గన్పడుచున్నదే? దీనినెందైనఁ దస్కరించితివా?

ఉత్త—అయ్యో! ఇదేమిన్యాయము. ఇది నాసొత్తుగదా? మీరిట్లు బల్కుట న్యాయమా?

దుర్బు—న్యాయమో అన్యాయమో? నిక్కముఁ దెల్పుము. లేకున్న శిక్షింపఁబడుదువు.

ఉత్త—(తనలో) ఈపరిపాలనము నష్టబుద్ధియున్న పేరునకుఁ దగియే యున్నది. (ప్ర) తెల్పెదవినుఁడు.

ద్బురు—తెల్పుము. నామ్రోల బుద్ధిగల్గి ప్రవర్తింపుము.

ఉత్త—మీరు పల్కినది నిజమేయగు. నీయంగుళీయక మొక రాచకన్నియది. ఆబిడ దీని విక్రయించుకొనిరమ్మన వచ్చితిని.

దుర్బు—ఆస్త్రీ యిప్పు డెందున్నది?

ఉత్త—ఈపురమునంగల ప్రతిమం దుండినది.

దుర్బు—అట్లయిన నాబిడను నాకడకుఁ దోడ్కొసరమ్మ్న?

ఉత్త—చిత్తము. నిష్క్రమించును.)

దుర్బు—మంత్రిలారా! యీరాచకన్నెనైన గూడవలయునుగాన మీరు సమయోచిత మెఱింగి సంచరింపుడు.

[పునఃప్రవేశము : ఉత్తమశీలుఁడు, కాంతామతియు]

దుర్బు—

ఉ. చక్కనిచుక్క యీసికచ ♦ సారసనేత్రి యెవాసి కాంతయో?
చక్కలతేసి భామినియొ? ♦ సూటిగ మారునిరాణియో? ఔరా!
నిక్కమెఱుంగలేనయితి ♦ పెటును గోటునుఁ జూడఁ జిత్తముం
జిక్కులపాల్పడెన్ బిదపఁ ♦ జేసెడికార్యము దోచదాయెగా?

కాంతా—ఈ యంగుళీయక మెవరిది?

కాంతా—(తలవంచి) నాదియే.

దుర్బు—మంచిది. మంత్రిలారా! ఈమె రాచకన్నెగాఁ గన్పడుచున్నది. ఈమె యీస్థానమ్మునందుండఁ దగదు. కావున నంతిపురంబునకుఁ గైకొనిపొండు.

మంత్రులు—చిత్తము. (కాంతామతితో నిష్క్రమింతురు.)

దుర్బు—ఔరీ! ఇంక నీదారిని నీవు పొమ్ము.

ఉత్త—అయ్యో! ఇదెక్కడి న్యాయము. ధనమీయకయు నుంగరమీయకయుఁ బొమ్మనుట?

దుర్బు—ఇంక నాకడ నధికముగ పేలికపొమ్ము.

ఉత్త—అట్లయిన నాయుంగరమొసంగుడు పోయెద.

దుర్బు—పోయెదవా లేదా? లేకున్న కారాగృహమందుంచెద. ఎవడురా?

[ప్రవేశము: సేవకుఁడు]

దేవా! సెలవు?

దుర్బు-నీవీదుష్టునిమనపురమునందుండకుండుఁ బట్టావలకుఁ బారదోలుము.

ఉత్త—(తనలో) ఔరా! ఎంత న్యాయపరిపాలనము. ఈపట్టణమంతయు నిట్లనేయుండెఁగాఁబోలు.

సేవ—ఏదియో గొణుగుచుంటివి. ఏమది? ఇందుండి తరలిపొమ్ము.

ఉత్త—పోయెదగాని సేవకా! నీపేరేమి?

సేవ—నాపేరా? మహానీచుఁడు.

ఉత్త—(తనలో) మంచి నామధేయమే మీరాజునకు, రాజ్యమునకు పరిపాలనకుఁ దగియేయున్నది.

సేవ—అధికముగా వాగక పోయెదవా లేదా? (అని నెట్టును.)

ఉత్త—(తనలో) ఇంతటి మహాన్యాయపరిపాలన మెందును గానము. "వినాశకాలే విపరీతబుద్ధిః" యనునట్లు రాజులకు వినాశకాలమాసన్నమైన విపరీతబుద్ధులు గల్గుచు. (నిష్క్రమించును.

దుర్బు.—సేవకా ! నీవనిమీాద బొమ్ము. (సేవకుఁడు నిష్క్రమించును)
నేనింక జాగుసేయక నాయంతిపురమునకుఁ బంపిన యాకాంత
గూడి రతిరాజసుఖము లనుభవించెద గాక.

(నిష్క్రమించును. యవనికజారును)

ద్వితీయరంగము—అంతఃపురము.



[ప్రవేశము—దుర్బుద్ధి, కాంతామతి.]

దుర్బు—తన్వీ ! పలుకవేమి ? నాపై యలుకా?

ఉ. కోపమదేలనే ? యమిత ♦ కోరికతో నిను వేడుచుంటి నం
తాపముఁ దీర్చి బ్రోవుమిక ♦ తాళఁగఁజాలనె మందయాన! నా
పాపురకుఁ జేరవేమి ? మధురంబగు పల్కులు పల్కవేమి ? నే
పాపము జేసినాడన ? కృ ♦ పామతి నన్గడ తేర్చు వేగమే.

కాంతా—(నిరుత్తరయగును.)

దుర్బు—కాంతా ! ఎంతబిలచినను బలుకవు ? ప్రత్యుత్తరమీయవు?
ఔను ! మంచిమాటలకు మామిడికాయలు రాలునా? నిన్నింక
బలిమిని బట్టుటయే యుచితము.

కాంతా—(తలవంచుకొని) అన్నా ! నే నెన్నో విధములఁ బ్రతిమాలు
చుంటినే ? కనికరము లేదా ? నీ తోబుట్టువునని తెల్పితినే ?
ఇంక నీమాధ్యము వీడవే ? కట్టా! యేమిగతి?

దుర్బు—రామామణీ! పన్నెల బ్రతిమాలెదవు ? నీవు బ్రతిమాలినం
తనే మిన్నకుందు ననకొంటివా? అదికల్ల. ఈదుర్బుద్ధిమహా
రాజు గుణగణంబు లెఱుంగక మాటలాడెద వేమి ?

కాంతా—అన్నా యని యెన్నోవిధములఁబ్రతిమాలినను నీబుద్ధి మరల
కున్న దే? నీవు క్షత్రియుండవుకావా ? క్షత్రియ ధర్మము

లెఱుంగవా? నీకుఁ దోఁబుట్టువులు లేరా? నీభార్యం నెవ్వడేని నిర్బంధించ నీకు సమ్మతమగునా? నీచా! ఇంక నీ దుర్బుద్ధి మాని సన్మార్గము ననుసరింపుము.

దుర్బు—కలికీ! నీవెన్ని విరసోక్తులాడినను సమ్మతమే కాని నీవు నా మరుసంతాపముఁ దీర్చి సన్మానందింప జేయునంతకు నిన్ను విడువను.

కాంతా—ఓరీ! నీరాజ్యమందందఱు నిట్టివారలై యుండిరా? నీతి నుప దేశించువారలు లేరా? ఒకవేళ యుండినను వారి యుపదే శము నీకు విషమయ్యెనా?

మత్తకోకిల.

దుర్బు—మారుబారికి నోర్వలేనిక ♦ మాటలేటికి? మానినీ!
ధీరుఁడీ దుర్బుద్ధియంచును ♦ ధీమతిన్ నను గూడుమీ

కాంతా—ధీరబుద్ధిగలార లన్యుల ♦ స్త్రీలఁగోరుదు రే? ఖలా!
ఘోరపాపంబనుచు మాని లో ♦ గొంకవేలర? మూర్ఖుఁడా!

దుర్బు—పాపమెట్టిదొ దెల్పవే మృదు ♦ పాటలాధరి! వేగమే
కోకమేలను జాగుసేయక ♦ కోర్కెదీర్పవె కామిని!

కాంతా—పాపమెట్టిదొ దెల్పవలెనా? ♦ పాపుఁడా మరి నీవె నా
పాపుఁ జేరకు దవ్వనుండుము ♦ బాడిగాదిది నీచుడా!

దుర్బు—కాంతామణీ! పాపమనునది గలదా? పరాంగనలఁ గూడిన వరువుపోవునా?

సీ. పరనారులను గూడు ♦ పాకశాసన విరోధి
సురగణంబుల యందు ♦ పరువుచెడెనే?

కాం—పరనారి యాహల్య ♦ భామఁగోరి యతండు
పడరాని యిక్కట్లు ♦ పడఁగలేదె?

దుర్బు—తారతోఁ గూడిన ♦ తారాపతికి యేమి
లోపంబు గల్గెనే ♦ లోలనేత్రి!

కాం—తారతోఁ గూడిన ♦ తారేశు గనలేద
కళలు క్రమంబుగాఁ ♦ దరిగియుంట

దుర్బు—రాధతో స్నేహంబు ♦ రహిఁ జల్పు శ్రీకృష్ణు
నాదిదేవుండని ♦ యనగలేదె?

కాం—రాధతో స్నేహంబు ♦ రమణఁ జల్పినకృష్ణుఁ
డోలగంబున బేలు ♦ పాలుగాడె?

దుర్బు—గీ. ఏల నీకథలెల్లను ♦ చాలుచాలు
నాదు కోరికదీర్పవే ♦ నళిననయన!

కాంతా—చాలుఁ జాలింక బుద్ధి నీ ♦ కేల లేదు?
అరయ నగ్గోర నియమముల ♦ నందగలవు.

దుర్బు—టుటారీ! నేనింక నిలువజాల. (అని చెయ్యి పట్టుకొనబోవును)

[అనుబంధము 9]

కాంతా—(తనలో) వీని బారినుండి యెట్లైన కపటోపాయంబుచే దప్పించుకొనవలెను. (ప్రకా) రాజా! తొందరొందకుము

దుర్బు—కామినీ! ఏమది. తెలియ బల్కుము?

కాంతా—తెల్పుటకుఁ గొంచెము సందియముగల్గి నోరాడుట లేదు.

దుర్బు—సందియ మక్కర లేదు. సర్వముం జెల్పుము.

కాంతా—నే నెంతకాలము నుండియో నిట్లుగా దిమ్మరుచుంటిని.

దుర్బు—ఎందులకు?

కాంతా—నామదికి నచ్చిన పురుషుఁ డెందుఁ దొరకునా? యని.

దుర్బు—నీమదికి నే నచ్చియుండ లేదా?

కాంతా—ఆ. నచ్చకేమి.

దుర్బు—నచ్చియే యుంటివి గదా? ఏల నింతరాద్ధాంతము జరిపితివి.

కాంతా—నాథుడ మీకు ననురాగము కలదో లేదో యని యిట్లు జరిపితి.

దుర్బు—ఎంతమాట? లేకేమి. నీవెట్లానరింపుమన్న నట్లానరింపనా?

కాంతా—అట్లయిన నిన్నే వరించదలచితిని.

దుర్బు—ముమ్మాటికి నిజమే వరించుట?

కాంతా—ఊఁ. అందుకే మరి వచ్చినది.

దుర్బు—అటులైన జాలమేల? రమ్ము యంతిపురంబునకు.

కాంతా—(తనలో) ఎట్లయిన వీనిని నమ్మించి యావలకు దాటవలెను. (ప్రె) పిచ్చిరాజా! అప్పుడే యంతిపురంబునకా? ఇల్లలికి ముగ్గు పెట్టిన మాత్రమున పండుగ వచ్చునా?

దుర్బు—ఇంకేమి యాటంకము గలదో నుడువరాదా?

కాంతా—నీక్షేమముఁ గోరి దెల్పుచుంటిని. నీ వంగీకరించిన నీకుఁ దక్కుదును.

దుర్బు—నాక్షేమముఁ గోరియే దెల్పుచుంటివా?

కాంతా—ఊఁ. అదేమరి.

దుర్బు—ఐన జాగేల? శీఘ్రముగఁ దెల్పుము.

కాంతా—వినుము. నాకొక వ్రతము కలదు.

దుర్బు—అది నాకడనే దీర్చుకొనరాదా?

కాంతా—అది దీర్చిన నీకోర్కెయే దీరగలదు.

దుర్బు—ఏమది తెల్పుము.

కాంతా—అది గౌరీవ్రతము.

దుర్బు—ఈవ్రతమున కేమిగావలయును?

కాంతా—ఇందులకా? లెక్కలేని ధనవ్యయము కాగలదు.

దుర్బు—అందులకు నాకు సమ్మతమేయగు. ఇంతియేగదా? మరేమి యులేదు గదా?

కాంతా—లేకేమి? మరొకటి పెద్దనియమము గలదు.

దుర్బు—అంత పెద్దనియమమేమి? అదియుఁ దెల్పుము.

కాంతా—వినుము. నాకొక వ్రతము నిర్వింపవలయును. అందు నారు మాసముల నారుదినంబులు గౌరిని నేపూజింపవలయును. అందుల కనేక దానము లొనర్పవలయు. అందులకుఁ దగిన ధనమువలయు నపుడెల్ల బంపుచుండవలెను.

దుర్బు—గీ. ఇంత కాలము గడువీయ ♦ నెట్లు లోర్తు ?
కొద్ది కాలంబుగా మార్చు ♦ కొనకయున్న
నేను జీవింతు ననుమాట ♦ మాని వేడ్క
మదిని యోజించుకొనుమింక ♦ మందగమన !

అక్కా! ఆరుమాసముల యారురోజులే? అంతవఱకు నేను నిలువ గలనా? పోనిమ్ము యారుమాసములు వీడి యారురోజులే చేయరాదా ?

కాంతా—అట్లొనర్చుటకు వలనుపడదు. తొలుత, నీయట్టి పురుష శ్రేష్ఠుడును, రాజకులాభరణమును దొరకునాయని యట్లొనర్చితిని. కాని నీవింత శీఘ్రముగ నాకుఁ జిక్కుదువనిదలంచనైతి. అయ్యో! ఏమి నాబుద్ధిమాంద్యము. అప్పుడు నాకింత జ్ఞానముండిన యిట్లొనర్చుదునగదా?

దుర్బు—ఎట్లో ప్రాణము నిల్పుకొందునులే.

కాంతా—మరొకటి మరచితిని.

దుర్బు—ఏమది?

కాంతా—నావ్రతము సమాప్తమగువఱకును నీవుగాని నీసేవకులుగాని నావ్రతాలయముకడకు రావలనుపడదు.

దుర్బు—అయ్యో! ఏమిది నన్ను జూచియైన ప్రాణములు నిల్పుకొంద మనుకొంటినే?

కాంతా—నీరూపము నాకన్నుల కగపడరాదు. నీశబ్దము నాచెవులకు వినబడరాదు. అట్లుగాక తప్పిజరించితివేని శిరము వేయివ్రయ్యలై చత్తువు. (కొంచెమాగి) అయ్యో! రాజా! నీవుచచ్చిన నాకింక దిక్కెవ్వరు? మంచి నాగతి యెట్లున్నదోగదా? నీక్షేమమును నాసౌఖ్యమును గూర్చి చెప్పితిని.

దుర్బు—ఓహో! నాక్షేమమునుగూర్చియే సర్వము నాకుఁ జెప్పితివా?

కాంతా—ఊఁ. అంగీకరి.

దుర్బు—అటులైన రమ్ము పోవుదము. (వెంటనంటును.)

కాంతా—దూరమున నుండుము, దూరముననుండుము. ముందు నీవు సాగుము.

దుర్బు—రమ్ము. (ముందుపోవును)

కాంతా—(వెంటపోవును.) (యవనిక జారును)

---

తృతీయరంగము:—కాంచనమాల సౌధము.

[ప్రవేశము—కాంచనమాల.]

ఆహా! మోహమెంతపాడుది. తన శరీరము తన నెఱుంగకుండ జేయునుగదా? నా యందచందములఁజూచి రాజాధిరాజగు ప్రతాపసేనుఁడు నన్నుంగూడి ధనమెల్లగొల్లవెట్టినాడు. ఒక్కధనమేమి? రాజ్యమంతయుఁ గోల్పోయి తుదకు నిలువ నీడలేక, కుడువఁ గూడులేక హాహాకారమెత్తి జరించుచుండె. ఔరా! వారకాంత పొందెంత ధనాధిపునైనను, ధనహీనునిగఁజేసి పడరాని శ్రమలఁ బాలొనరించునుగదా? ప్రతాపసేనా! నీవు నాచెంతకుఁ జేరునపుడెంత గౌరవముగనుంటివి? పిమ్మట నాకు దాసుడవై పెద్దలవాక్యముల వినక రాజ్యమును, భార్యను గోల్పోతివే? ఇందులకు నేనేగదా కారణము? ఛీ! నేనెంతపాపురాలను! ఓ ప్రతాపసేనా!

సీ. నారూపమును జూచి ♦ నన్ను పీడకగదా?
గురునాజ్ఞ మీరిట్లు ♦ గులికినావు
నారూపవనము జూచి ♦ నమ్మివచ్చియుగదా ?
భార్యను వనముకు ♦ బంపినావు
తుచ్ఛసుఖంబుచు ♦ నిచ్ఛయించక గదా?
కులగౌరవము మంట ♦ గలిపినావు
నృత్యగీతములను ♦ నిత్యంబు వినిగదా?
మేనుమఱచి నీవు ♦ మెలగినావు

గీ. రాజ్యపాలన మంతయు ♦ రగులఁబెట్టి
ప్రజల సౌఖ్యంబు లెల్లను ♦ పాడుచేసి
నాదు చెంతకు జేరితే ♦ నమ్మి; తెకట!
వేశ్యతోఁ పొందు విటులకు ♦ వెతలుగావె.

నే నగవనేల ? బుద్ధిహీనులై విటకాండ్రు మా గుమ్మములదరిఁ జేరి మమ్ము ప్రార్థింప మేమేమి సేయగలము? అంతయు విటులదే దోషము. మేము వారల బ్రార్థించితిమా? మాగృహంబు లలంకరించుమంటిమా? తల్లిదండ్రులమాటల సరకుఁ జేయక పోయినవారై, చదువుసంధ్యల మాని త్రాగుబోతులై, మావేశ్యల వాడఁ జేరి సర్వముఁ గోల్పోవుచుండిరి. ఇందులకు మే మేమి సేయగలము? మా దేమి దోషము ?

(నిష్క్రమించును.)

[ప్రవేశము:— ప్రతాపసేనుఁడు ఒకవైపునుండి]

ఔరా! కాంచనమాలా! ఎంత జేసితి వే?

ఉ. కూడును నీళ్ళు లేకఁ గను ♦ కూరికి నేటికి మూడునాళ్ళు తే
జాడనుబోవు వేశ్యనిట ♦ పాదము గొందెను బెట్టుచుంచు నే
వేడద నిప్పుడానతియ ♦ వేయుదె బోనము పొట్టనిండ, మీ
మోడకబోదు పూర్వవిధ ♦ మా చితితో మరి సానియింటికిన్

ఆహా! సర్వమును కాంచనమాలకు ధారవోసితి. అన్నపానీయంబులకు దూరమైతి. కులాంగనను గోల్పడితి. బంధుజనంబులకుఁ బగవాఁడనైతి. బ్రాహ్మణులకు తృణప్రాయుఁడనైతి. కట్టా! తుదకు నేను మూఁడుదినములనుండియు యింతకూడు దొరకక క్షుద్బాధచే మిగులగాసిలుచు కృశియించియుంటిని. పూర్వము పడిదిత్తుకొలఁగు నా కాంచనమాలయైన యింత కబళముఁ బెట్టకుండునా? యనినమ్మివచ్చితి. ఆ పెంయు నేమను నోకి ఏమినావెత్తి? కాలముదీరినను, ధనహీనత సనుయమునను, స్నేహితులుందురా? గౌరవముండునా? తుదకుకేడజాతివాఁడు నైతమతనకన్న హీనునిగఁజూచును. ఇంతయేల? కాంచనమాలను బిలచెదగాక. (తలుపుతట్టుచు) కాంచనమాలా! కాంచనమాలా!

(ప్రవేశము—కాంచనమాల ఒకవైపునుండి)

ఎవ్వఁడవు నీవు? కాంచనమాలా యని ఖండితముగ బిలచుచుంటివి, నీ వెవ్వఁడవు?

విప్రా—కాంచనమాలా! ఇంతలోనే మరచితివా?

కాంచ—ఎవ్వఁడవో యెఱుంగను. ఆవలకుఁ బొమ్ము.

విప్రా—కాంచనమాలా! మనవి.

గీ. కూడు దిని నేటికిని నేను ♦ మూఁడునాళ్లు
తిండిదొరకక నీబళంబు ♦ లిందఁజేరి
వేడుచుంటిని పట్టెడు ♦ వేయువమ్మ
మానినీమణి! కాంచన ♦ మాల! నాకు.

కాంచనమాలా! ప్రాణములు పోవుచున్నవి. అంతప్రసాద మొసగితివేని దానినోటనిడుకొని నాతోఁ బ్రవను నేను పోయెదను. పూర్వస్నేహమైన దలపుమా?

కాంచ—బుద్ధిహీనుఁడా! నీవు నాకు పూర్వస్నేహితుఁడవా? నోరు

మూసికొనుము. ఈతూరిట్లుభాషించిన తగిన బుద్ధిఁజెప్పించెద పొమ్ము. పాదములేదు గీదములేదు. (అని లోనికిబోవును.)

పరిత—అక్కటా! పరితాపసేనున కీవేశ్యాస్నేహమువలన నట్టిగతిగ లినది. తుదకు నొక్కమెతుకైనదొరకక క్షుద్బాధచేకుంది ప్రాణములు వీడవలసెనే! హా! దైవమా! ఎంతనిర్భాగ్యుఁడ.

సీ. తండ్రితద్దినమ్మున ♦ దలఁచక మదిలోన
వెలకాంత చెంగట ♦ మెలగినాఁడ
భార్యసౌందర్యంబు ♦ భావమందెంచక
వేశ్యకాంతకుఁజిక్కి ♦ వెలసినాఁడ
కులగౌరవ మినుమంత ♦ గోల్పోవుటెఱుఁగక
భోగకాంతకుసేవ ♦ బూనినాఁడ
రాజ్యమందుఁ బ్రజల ♦ రాయిడినరయక
పణ్యాంగనగృహాన ♦ పండినాఁడ
గీ. యింతయును బుద్ధిలేక రో ♦ యింతచింతఁ
జేరి నే నట్టి కష్టముల్ ♦ దీరిపోవ
కుండుఁబట్టుగఁ జేసుక ♦ మండినాఁడ
వేశ్యలను గూడువారికి ♦ వెతఁజలిపి యొక ?

ఓ భారతీయులారా! సోదరులగు నోవిటులారా! ఇదియంతయు నా యనుభవముచే నుగ్గడింపుచుంటి.

సీ. ధనమంతయును లాగి ♦ తన సేవకునిఁ జేసె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
రాజ్యమంతయుమాపె ♦ రాజన మెడబాపె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
పట్టెడన్నముదొందు ♦ పుట్టకుండఁగఁ జేసె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
సన్యాసివేషంబు ♦ సన్యాయముగ వేసె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు

గీ. వేశ్యకాంతను గూడ నీ ♦ వెతలు నాకు
వచ్చి చేరెను గటకటా! ♦ నిశ్చయముగ
సుగుణధనులార! భారత ♦ శూరులార!
పోకుఁడింకను వేశ్యల ♦ పొందుకొఱకు.

మరియు,

మ. వెలకాంతల్ గపటంపుఁ బ్రేమ నహహా! ♦ వ్రేల్వేలు ద్రవ్యంబు లి
య్యల వెన్వెసియులాగి భిక్షుకునిగా ♦ సిగ్గైన లేకుండఁ గా
యిలువాకిండ్లను నమ్మఁజేతు రకటా! ♦ యిస్సీ! మహామారులౌ
వెలయాండ్రన్ మరిగూడదింక దానుచున్ ♦ వేనోళ్ళఁ బ్రార్థించెదన్

ఉ. గానకళాదులన్ గనియు ♦ కాముఁడు నెత్తికి యెక్క యెక్కఁడా
మానము మంటగల్పి మతి ♦ మాంద్యుడనై జరియించినాడ యా
మానిని వేశ్యకాంత యను ♦ మానము లేకను జేసి భిక్షుకున్
మానిత రాజ్యలక్ష్మి! ప్రియ ♦ మానిని! గోల్పడినాట దైవమా!

గీ. చిచ్చుకొంపను నిడికొని ♦ చింత నొంద
ఫలముగల్గునె? పుడమిలో ♦ భవ్యులార
గల్గెయుంపుడు కత్తెచే ♦ గష్టము లిటు
మీరలైనను సద్బుద్ధి ♦ మెలఁగుఁడింక.

సర్వముఁ గోల్పోయిన నేనెంత నీతి జెప్పినను ఏమిలాభము? తొలుత నాగురుఁడు నాకెంతయో నీతిబోధించలేదా? నేనద్దానినివింటినా? పాప మా గురూత్తముని సైతము కల్లబొంకులఁ బల్కెనని వేశ్యమాటల వినియేగదా? రాజ్యమంతయుఁ గూడ విల్వానిచుక పరదేశములకుఁ బారద్రోలినది. ఇట్టి గురుద్రోహినగు నాకిది యే శిక్ష.

(అనుబంధము 10)

నేనింక నాప్రాణకాంతయగు కాంతామతిని కాంతారమందు నెమకుచు ఈ సన్యాసివేషమునఁ దిరిగెదఁగాక. (నిష్క్రమించును.)

[పునఃప్రవేశము — కాంచనమాల.]

ఎట్టిపండితుఁడైనను, ఎట్టివీరుఁడైనను, ఎట్టిధనికుఁడైనను, మోహము పరదాసునిగఁ జేయునుగదా? అహా! మోహమెంత చెడ్డది? ఇప్పుడిమ్మహియందు వారాంగనలకులమువంటి నీచకులమును, వారివృత్తియంతనీచవృత్తియు, నేకులమందునను లేదు. దైవము మమ్మును ఒక్కరికేగృహిణులగాఁ జేయక పలువురికేల జేయవలెను? ఇట్టి మా వారాంగన లెందఱినో జోగులఁజేసి పడరాని బందల పాల్బడఁజూడిరి, కానాను! ఇందు మా వేశ్యల లోపమేమున్నది? అంతయు బురుషులదే లోపము. ఏమన పిత్రార్జితములగు మడిమాన్యములమ్మి మాకొసంగుమని వేశ్యలు విటులను బాధించిరా? ఇపుడు మా వేశ్యాకులమందుఁ గూడ సంఘములస్థాపించి వ్యభిచారవృత్తిఁ బారద్రోలవలయునని పాటుపడుచుండిరి. చాలవఱకు సంఘ మభివృద్ధిలోనే యున్నది. ఇప్పుడు వ్యభిచారదేవత నానాటఁ గుంది కృశించి క్షీణదశ నందుచున్నది. వ్యభిచారమన్న కులమందుననేగాని మరి యేకులమందునను లేకుండ, ఇపుడన్ని సర్వకులములయందును గలదు. శ్రీమంతులు సైత మిందే జేయుచుండిరి. వారికేగట్టి బట్టయుఁ దిన మెతుకును లేదా? ఓ భారతీయ సోదరీమణులారా! వారకాంతలారా! నామనవి వినుఁడు

సీ. అశనమ్ము దొరకక ♦ వెసవాఁగుమును నమ్మి
కాలంబు గడపెడి కాంతలార!
అర్థమ్ముకై మహా ♦ యాశ జెందుచునుండి
పరులకూటమిఁగోరు ♦ పడఁతులార!

తుచ్ఛసుఖముఁగోరి ♦ దోషమెంచకవిటు
లనుగూడి సుఖయించు ♦ లలనలార !
రోగినైననుఁబరే ♦ భోగింపఁబడ్బుకు
చూచుచుండెడి తుచ్ఛ ♦ సుదతులార !

గీ. పాపభూయిష్ఠమైన యీ ♦ పాడువృత్తి
విడిచిపెట్టుఁడురంచు నే ♦ వేయిగతుల
వేడుచుంటిని ప్రియులార ♦ వెలఁదులార !
భరతభవులార ! మణులార ♦ భామలార !

ఇట్టి వ్యభిచారవృత్తి వలననే పరదేశ వ్యాధులగు నంటువ్యాధులచే క్షీణించి తుదకు సంతానహీనులగుటకుఁగూడ కారణము.

మరియు.

సీ. కులకాంతలను బాసి ♦ కులధర్మములఁరోసి
సానికంచలఁజేరు ♦ చపటలార !
పిన్న పెద్దలటంచు ♦ నెన్నక మదిలోన
వెలకాంతలను జేరు ♦ వ్యర్థులార !
పూర్వార్జితములెల్ల ♦ పూజ్యంబుగానమ్మి
రాగమ్మునఁజేఁ జెడు ♦ జోగులార !
ధనధాన్యములుఁజెల్ల ♦ దాస్యవృత్తి నిబూని
కాపురమ్ములు రోసి ♦ పాపలార !

గీ. వలదు వ్యభిచారవృత్తిచే ♦ గలుగునఘము
వేశ్యకాంత భోగంబుచే ♦ వెతలుగల్గు
మానుఁడదియని మొఱ్ఱిడ ♦ మాన్యులార!
సుగుణధనులార ! భారత ! శూరులార !

వ్యభిచారవృత్తిచే యఘంబు గల్గుననియు, యశంబు పోవుననియు మ మనసనాతన ధర్మములు బోధించుటలేదా? అందు వేశ్యాసంపర్కము

చే గల్గు నష్టకష్టములు కనుఁగొనఁజాలిరిగదా? ఇంక వేశ్యల గోరక వారి స్నేహముఁ జేయుకుందురుగాక యని పేవిధములఁ బ్రార్థించెదను.

(అనుబంధము 11)

(నిష్క్రమింతురు. యవనికజారును)

---

## తురీయరంగము.

### ప్రదేశము—అడవి.

[ప్రవేశము—ప్రతాపసేనుఁడు విషాదమున]

(అనుబంధము 12.)

అయ్యో! ఎంత ఘోరము ? ఎంతదుండగము? ఎంతపాపము?-ఎంతశాపము?-కులకాంతను ఘోరాటవుల పాలొనర్చినమహాపాపుఁడ-నీచుఁడ-కట్టా! నన్ని యధోగతిపాలొనర్చిన దద్దురాత్మురాలగు కాంచనమాల గదా? వాకా దుర్జాతిస్నేహము గల్గకున్న నియ్యగచాట్లు రాకుండు నేమో? ఆపాపివెరాహాంధకారమున మున్గి భార్యమోముంజూడక దాని మాటలే వేదాక్షరంబులని నమ్మిన నాకింత యోగము సంభవించినది. కట్టా! భార్యమోమైనఁ జూడనిచ్చినది గాదు—నాముద్దుగుమ్మ నదిసి ముచ్చటించనిచ్చినది గాదు—అంతయు మహాగారడి జేసినది—మాయ యొనర్చినది— మసిఁబూసినది—రాజ్యభ్రష్టునిం జేసినది—అన్నపానీయంబులు లేక యల్లాడునట్లొనర్చినది—తుదకీ సన్యాసివేషము వేయించినది—అహా! కాలమా! నిన్నువర్ణించ నే కవికిందగును? కవుల కలముఁనకుఁగూడ నెదురైతివే?—లోకులను లోకువుచు నీస్వాధీన మొనర్చుకొంటివే?—ఔరా! కాంచమాలా! ఎంతజేసితివే? నీమోహరజ్జువుచే నన్ను బందీకృతునిఁ జేసి నన్నెల్లవిధముల సన్యాసిని జేసితివిగదా? కులటా! నీయాజ్ఞమీరక కులగురువును రాజ్యభ్రష్టునిం జేసి కల్పలమందుచుంటిని. ఓ ప్రాణప్రియా! కాంతామతీ!

నీ వెందేగియుంటివి ? అయ్యో! ఈ ఘోరారణ్యమున నేకూర్రమృగం
బులవాతఁ బడితివో యెఱుంగజాల, లేక ప్రాణకాంతునిచే నిరాకరింపఁ
బడిన నే నుండిననేమి లేకుండిన నేమియని యనూయచే నెందైనఁ
బ్రాణములు గోల్పోతివా? నాకెవ్వరు దెల్పి నన్నూరడింతురు ? నీ
సుందరవదనారవిందము గాంచు భాగ్యమబ్బునా ? అది యేకల్ల.
అయ్యో! ప్రాణేశ్వరీ! నీపాల నాదిక్కుమాలిన వేశ్య మహామారియ
య్యెనే ? ఆవేశ్యయే యొనర్చినది? నేను నిన్ను సగౌరవముగఁ జూచి
ప్రేమించిన నీకీకడగండ్లు రాకుండునుగదా? నిక్కముగ నీపాలి మారిని
నేనయితిని.

సీ. ఎన్నఁడు నాయింతిఁ ♦ గన్నుదమ్ములఁగాంచి
సంతసంబున నుండ ♦ జాలువాఁడ
నెన్నఁడు నాకాంత ♦ నెలమిమీరఁగఁ గాంచి
ముచ్చట లాడుచు ♦ మురియువాఁడ
నెన్నఁడు నాప్రియ ♦ వన్నె చిన్నెలఁగాంచి
బిగికౌఁగిటను నెప్డు ♦ బెనఁగువాఁడ
నెన్నఁడు నారాణి ♦ కున్న సొగసును గాంచి
ప్రాణమిదంచని ♦ ప్రబలువాఁడ

తే. గీ. నెన్నఁడింక నాదైవంబు ♦ నన్ను వాలి
ప్రాపుఁజేరిచి సౌఖ్యంబు ♦ జూపఁగలుగు
గటకటా! యట్టిపుణ్యంబు ♦ గలుగనౌనె?
లేదు యీరాజన్మ కికమీద ♦ లేదు లేదు.

దైవమా! ఇఁక నేనేమిచేయుదును? దురాత్ముఁడనగు నన్నుఁగూడుట
చేతఁగదా నా పురంధ్రికిట్టియిడుమలు. అయ్యో! కాంతామతీ! కాంతా
మతీ! నడుమ కాళ్లాడకున్నవి.

[ప్రవేశము—దూర్వాసుఁడు.]

ఈతఁడెవ్వఁడైయుండునో? ప్రియకాంతా వియోగంబుచే విషాదమందుచున్నాఁడు. విచారించెద. ఓయీ! నీ వెవ్వఁడవు?

ప్రతా—తపసేంద్రా! వందనములు.

దూర్వా—శుభమగుఁగాక. నీ వెవ్వఁడవు? విషాదమేల?

ప్రతా—అయ్యా! తొలుత నేనెవ్వఁడనైన నేమి? నేటికి సన్యాసినైతిని.

దూర్వా—ఓయీ! కుందకుము. నీచరిత్రమంతయు విశదీకరింపుము.

ప్రతా—మౌనిచంద్రమా! నేను ప్రతాపసేనుఁడను భూరమణుఁడను. వేశ్యాస్నేహముచే సర్వముంగోల్పోయి యీవేషముం ధరించిన సన్యాసిని. వేశ్యమాటలు నమ్మి కులకాంతను కానలఁ బారఁదోలిన నీచాత్ముఁడను. నన్ననుగ్రహింపుము.

(పాదములపైఁబడును.)

దూర్వా—(పైకిలేవదీసి) వత్సా! లెమ్ము. ప్రతాపసేనా!

తే. గీ. నీ సవిస్తారమంతయు ♦ నెఱిఁగె దనర
దివ్యదృష్టిఁ గనుఁగొంటి ♦ దిగులు వీడు
నీకొఱకు నాపతివ్రత ♦ నెమ్మితోడ
గౌరిపూజలచే పొద్దు ♦ గడపుచుండె.

ఓయీ! చింతలుడుగుము. నీ నిజకాంత నీరాకకై పరీక్షించుచు గౌరీవ్రతమొనర్చుచున్నది. కొలఁది కాలమున నీభార్యం గలియఁగలవు.

ప్రతా—మహాత్మా! తమకెఱుకఁబడని వార్తలుండవు. నాయెడ కరుణించి నా ప్రాణేశ్వరి యెందుండెనో సెలవీయ వేఁడెద. అయ్యా! నా యింతియుండు పురముం దెల్ప వేఁడెదను.

దూర్వా—ఓయీ! ప్రతాపసేనా!

తే. గీ. నాలుగు యోజనముల దవ్వు ♦ నంగలదది
భూరిపాతకపుర మందు ♦ బుధులు పతత
మందునున్నది నీ కాంత ♦ నరయఁబొమ్ము
సర్వమచ్చటఁ దెలియు నా ♦ సాధ్వివలన.

నా కనుష్ఠానమునకు కాలమైనది నేనేగెద. (పోవఁబోవ)

చంద్ర— (అడ్డగించి) అయ్యా! నా కాంత జీవములతో నుండినదా ? అంతయు నిక్కువమా ?

దూర్వా— ఓయీ! ఏమి నీవెఱ్ఱి ? మార్గముం దెల్పితింగదా పోవ రాదో ?

చంద్ర— అయ్యా! నాపురమునకు మార్గ మెయ్యది ?

దూర్వా— (కోపమున) ఏమీ మార్గ మెఱుంగవా! తొలుత వేశ్యనుం చుకొను మార్గ మెవ్వరుబోధించిరి ? ధనతనుమదాంధకార ముచే యకార్యము లాచరించిన ద్రోహివి. ఛీ! నీమోముం జూడ దురితమగును. నీదారి నీవు పొమ్ము.

(నిష్క్రమించును.)

చంద్ర— కట్టా! ఈ హరిశ్చంద్రుఁడు నామదికి మఱింత మంటతగిల్చి పోయెనే? ఆ మహాపాతకపుర మెందుగలదో యెట్లుగవలెనో యెఱుంగనైతినే ? హా! విధీ! తుదకు నన్నిట్టి కష్టములఁ బెట్టి తివి? మునిపుంగవుఁడు నా ప్రాణేశ్వరి వార్త పూర్ణముగ నెఱింగింపక పోయెనే? మూరుబల్క నా పైతనకోపాగ్నిని బరపి తనదారిని తానేగెనే? అయ్యో! యింకేమి దిక్కు? ప్రాణే శ్వరీ! మహాపాతకపురమందుంటివా ? ఎట్టికడగండ్లనుచుం టివోగదా? నీయెడ నేనెంత ద్రోహమొనర్చితిని?— యెంత దుండగము గావించితిని?— ప్రియా! నీదివ్యసుందరాకారము మహాపాతకపురమందుండెనా? ఇదే నీ సందర్శనమునకు వచ్చు చున్నాఁడ హా! దైవమా! ఏమినాగతి?

కం. వెలకాంతివలన నివ్వాధి
గులకాంతను గొలుపోతిఁ ♦ గూటికి కరవై
పలుబాములఁ బడనాయెను
గలనైన నిబాముననంచు ♦ కట్టా ; యెఱుఁగన్.

(నిష్క్రమించును.)

(యవనిక జారును.)

---

పంచమరంగము:—కాంతామతి సౌధము.

[ప్రవేశము:—కాంతామతి సౌధమందాసీనయై]

(అనుబంధము 3)

ఆహా! దుష్టుఁడగు యీ దుర్బుద్ధిరాజు చేజిక్కి నేటి కారుమాసములైనది. కొలంత వానికి నారుమాసముల వారురోజులు గారీవ్రతము సేయవలయునని యాతని సమాధానపరచితిని. కట్టా! నేఁటి కారుమాసములు గతించె. నింక నారుదినంబులే గడువుగలదు. ఈమధ్యా నములనుండి యనేక తీవ్రతదానముల కొఱకును, భుక్తమునకును, నేత్రోత్సవముగఁదిలకించుటకును, లెక్కకు మిక్కుటంబుగ వచ్చుచుండిరి. కాని అందు నా ప్రాణకాంతుని యాగమనము లేదయ్యె? హా! దైవమా యీరుమాసములనుండి రాని నా ప్రాణేశ్వరుఁ డీయారుదినములలో వచ్చి నన్నుఁ గాపాడునా? అసంభవము! అసత్యము! హా! నాధా!

[ప్రవేశము:—ప్రతాపసేనుఁడు]

(అనుబంధము 14)

హా! కాంతామతీ! నేనెంత పాపుఁడ. ఎంత క్రూరుఁడ. ఎంత నీచుఁడ. కనుక నే నా కీగతి గల్గినది.

కాంతా—(తనలో) ఈమహానుభావునిఁజూడ నాప్రియకాంతునిపోల్కి

గానుండె. అయ్యో! నాకంతటిభాగ్యముకల్గునా? ఒకరినిఁబోలి మఱియొకరుండరా? ఐన యీయన సమాచార మేమియో నడిగి తెలిసికొనియెద. (ప్ర) అయ్యా! మీరలెవ్వరో యెఱుంగ. కాంతామతి, కాంతామతి యని మిగుల దుఃఖించుచుంటిరి. ఆమెకును మీకును నేమిన బాంధవ్యముండెనా? తెల్పుఁడు?

వ్రతా—మహాత్మ్మా! నీవెవ్వరి దానవో నేనెఱుంగ. నాప్రియ కాంత కొఱకై వనముల దిమ్మరుచుండ, అందు దూర్వాసమహాముని నన్నుఁగని నావృత్తాంతమంత యాలించి "ఓయీ నీభార్య మహా పాతకపురమున నీకొఱకై గౌరివ్రతము సేయుచున్నది" అని నుడువ నే నీపట్టణముఁ జేరి వెదకి వెదకి వేసారితిని. నా కాంతజాడ తెలియదయ్యె? శరీర మలయుటచేత యీతిన్నెపై శయనించి యెల్లి నెమకుదమని యింకు జేరితిని? ఇదియె నావృత్తాంతము.

కాంతా—(స్వ) ఇదంతయు నావిషయమైన చరిత్రవలెనే యుండినది. ఐన నడిగి తెలిసికొనియెద (ప్ర) మహాత్మా! నీభార్య యేకా రణమున నడవుల పాలయ్యెనో దెల్పవేఁడెద.

సీ స మా లి క.

వ్రతా—సీ. కాంచనమాలరో ♦ కాంతయింటికిఁ జేరి
జెప్పిన ట్లెల్లఁ నేఁ ♦ జేసినాఁడ

కాంతా—అయ్యో! ఎంతమోహమునఁబడితిరి? అట్లు సేయఁదగునా? ఆపైని?

వ్రతా— పరిణయంబును లేక ♦ బ్రహ్మచారిగనుండఁ
గూడదటంచని ♦ గురుఁడుబల్క

కాంతా—ఆహా! అతఁడెంతపుణ్యాత్ముఁడు.

వ్రతా— బలవంతముగ నాటఁ ♦ బరిణయం బొనరించఁ
గా రాగ్యమున నా ♦ కాంతనిడిచి

కాంతా—పాప మాకాంత నట్టి కష్టములపాలు గావించిరి? పైని?

వ్రితా— అంధురాలనివిని ♦ యాచెలిం జూడక
కాన కంపినయట్టి ♦ కలుషమతిని

కాంతా—(స్వ)హా! దైవమా! అంతయు నాచరిత్రముగదా? పిమ్మట
నేమిజరిగెనో? (వ్రి) తరువాత?

వ్రితా— నా రాజ్యధనధాన్య ♦ మారాము గ్రహియించ
సర్వము శూన్యమై ♦ జరుగఁబడియె

కాంతా—(స్వ) కష్టా! ఎంతదురవస్థ (వ్రి) అటుపిమ్మట?

వ్రితా— కూడు నీళ్ళకు వాచి ♦ వేడఁబోవఁగ నది
జేరనీయకఁ గొట్టెఁ ♦ జెప్ప నేల ?

కాంతా—(స్వ)హా! దైవమా! తుదకిట్టిగతిఁ గల్పించితివి? (వ్రి) పిమ్మట?

వ్రితా—గీ. అంత కాశకువచ్చి నా ♦ కాంత యెందు
నున్నదంచును వెదకుచు ♦ నున్న నన్నుఁ
గాంచి దూర్వాసుఁడ న్మని ♦ కసికరమునఁ
దల్చిపోయెను సకలంబుఁ ♦ దేటపడఁగ.

అంత నగరముఁ బ్రవేశించి నాప్రియకాంత కాంతామతిని వెదకుచుంటినిగాని కాంచనైతిని.

కాంతా—మహాత్మా!

గీ. నిన్ను విడనాడి వనములోఁ ♦ మెలఁగి పిదప
వైశ్యుచేఁ జిక్కి వానిని ♦ వదలుచుకొని
మూర్ఖుఁడైనట్టి యీరాజు ♦ మ్రోలఁబడియు
గుందుచుంటిని మీకు నై ♦ డెందమందు.

ప్రాణేశ్వరా! తొలుత మీరు చెప్పిన నిర్భాగ్యురాలగు కాంతామతి యిదియే. నాథా! వినుము. ఈదుర్బుద్ధి బారినుండి దప్పించుకొన నావశము గాక "యారు మాసముల యారు దినములు నాకు గారీవ్రతముగలదు.

ఆపైని నీయిష్టము” అని నుడివి నాపాతివ్రత్యమును గాపాడుకొనియా యాఱు మాసములనుండి మీరాకకై జూచుచుంటిని. నేటి కాఱుదిన ములు గడువుగలదు. ఇంక మీరారువచ్చుట కల్లయని దుఃఖించుచుం టిని. నాపుణ్యవశముచే నేఁడు మీసుందర వదనారవిందముఁ దిలకించు భాగ్య మబ్బినందుకు సంతసించితిని.

వ్రతా—అయ్యో! కాంతామత! నీ వీ నిర్బంధమునుండిదాటుటెట్లు? నన్నుఁ గూడుటెట్లు?

కాంతా—ప్రాణేశ్వరా! నేనొక్కటి దెల్పెద వినుఁడు. నేఁటినిశీథమున నిశ్రేణిసహాయమున నే మీచెంతకుఁ జేరెద, కావున మీరిందే శయనింపుఁడు. మౌనము ధరింపుఁడు. ఈ జాడ దుష్టబుద్ధికిం దెలసిన కార్యభంగము కాఁగలదు. ఇఁక శయనించుఁడు.

వ్రతా—ప్రాణేశ్వరీ! మఱచెద వేమో?

కాంతా—ప్రాణేశ్వరా! మీకొఱకె కనుదు చూచుచున్న నేను మఱ తునా? ఇఁక విడుగింతునా?

వ్రతా—(శయనించును.)

కాంతా—(స్వ) నేఁటికి నానోము ఫలించినది నావ్రతము ధన్యతనొం దినది. నేఁ గృతార్థురాలనైతి. వెరలకంటఁ బడకుండ నీయర్ధ రాత్రి యుండుండి నా నాథునిఁగూడి మార్గముఁ బట్టెదఁగాక.

[ప్రవేశము. దొంగ.]

ఇయ్యాలకి మూఁడురోజులనుంచి యీడదిరిగినా యీంలేదు. కారణం యేందో తెల్దు. అన్నింపున్నుంయేంయేటుఁగ. అంకాళమ్మను, పోలేరమ్మను, గంగానమ్మను, మాలచ్చుమ్మను. లంకమ్మను మరిగత్తె, పోతరాజును, అండటికి మొక్కవత్తుండాను; నేను మొబ్బేటకొచ్చ యన్న డిట్టా పూరిక మోలేదబ్బా! యీమూఁడురోజులనుంచి ఓరి మొగం సూత్తుండానోగాని మొబ్బేట దొరకటంలేదు. అసలు నేను

దొంగల్లోకెల్లా మొనగాణ్ణి. నే పుట్టిన గడియ అట్టువంటిది. మిట్టమద్దేల జాంపొద్దు కాడ. పోద్దుకూకేల, జాంపొద్దుపోయి మరిగత్తే అద్దంరేతిరి కాడ సిద్ధరమత్తులో అమాసనాడుపుట్టేను. అమాసనాడు పుడితే మంచిదొంగతనంఅబ్బుద్ది. అమ్మతోడు. ఇయ్యాల కులదేవతని యేడు కొని మొబ్బేటకెల్తా. కీర్తన.

గంగానమ్మా! పోలేరమ్మా! కరుణించీనన్ గావుమమ్మా॥ గం॥

ఆరుకాళ్ళ జీవమిపుడె-యరవగాను బలియునిత్తా

ఊరియున్నా కల్లుదెచ్చి-వారపోతు తల్లిరో! ॥గం॥

వొంగివొంగీ కన్నమేచి-ఒడుచుకొత్తా చొమ్ములన్ని

దొంగతనానికియెల్తా-తోడురావె తల్లిరో!...॥గం॥

ఇంకాపోతా. ఈమేడకే కన్నామేత్తా. (పొఖ్ఖుమువ్రి తావసేనుని జూచి) ఈడోడో పండుకుండాడు. ఈడికాడ యేమన్నా ఆళపాటు నూసుకుందాము. (నెత్తిపై గుడ్డదీసి విచ్చిచూచి) ఛీ! యదవనా యాలా! అంతా సినిగిందే? (చూచి) ఓరిబాబో యీడోడో సన్నా సోడు. ఛీ! యీడిమొగం సూడగూడదు. దరిద్రపెదవ యీమేడ కియ్యాలబొక్కడతా. (కన్నంవేసి అందుకాళ్ళుపెట్టును తేలుకుట్టును)

కీర్తన

తేలుగుట్టింది-అబ్బో తేలుగుట్టింది-నల్ల తేలుగుట్టింది-అహా తేలుగుట్టింది॥
తేలుపాడుగాను బాగ కాలికిగుట్టింది అబ్బా - నల్ల తేలుగుట్టింది-
నన్ను తేలుగుట్టింది॥

వజ్రమేళ నేనులేసి - వొచ్చాను పోదుగాను - తేలుగుట్టింది
అబ్బా తేలుగుట్టింది - నల్ల తేలుగుట్టింది - హా! తేలుగుట్టింది॥

కాంతా—(చప్పటులు గొట్టి) పాణేశ్వరా! పాణేశ్వరా! మాటలా డక యిటురండు. నడుతేయి మీరినది.

(అన దొంగ చెంపకుబోవును. కాంతామతి మేడదిగిలోనకుబోవును)

(యవనిక జారును.)





శ్రీ రస్తు.

# కాంతామతి

## చతుర్థాంకము.

ప్రథమరంగము:-అడవి.

[ప్రవేశము: దొంగ, వానివెంట కాంతామతి]

దొంగ—(అరణ్యమధ్యమున నిలచి మాటలాడకుండును.)

కాంతా—ఏమిది. నానాథుఁడేయని మోసపోతినే? అయ్యో! యెంత గ్రహచారము. (అని వణుకుచు దొంగనుజూచును.)

దొంగ—(కదలకుండ గ్రుడ్లు ద్రిప్పుచు నిలచియేయుండును.)

కాంతా—భయముతో) అయ్యో! ఇదియేమి? నాప్రాణేశ్వరుడని నమ్మి మోసపోతినే! హా! మూలదైవమా! ఇంకను నా కడగండ్ల గట్టుపట్టింపక బాధించుచుంటివా?

దొంగ—(పైరీతిగానేయుండును.)

కాంతా—(భయముతోజూచి) చూచుటకు నల్లగ నొక మొద్దురీతిగ గన్పట్టుచున్నది. ఇదేదైన యడవిమృగమైయుండునా? అడవిమృగమైన యిట్లేల నిలచియుండును? కాదు కాదు. (మరల చూచి) అడవిమనుష్యుఁడైయుండునా? అడవి మనుష్యుఁడైన వికారరూపముగ నుండడా? ఆఁ స్ఫురించినది. కొరవిదయ్యములు నల్లగనుండుననియు, మాటలాడక మొద్దువలె నిలచియుండు ననియు, మాతల్లిదండ్రులు నాచిన్నతనమునఁ జెప్పియుండిరి.

ఇదిగాక అవి ముఖ్యము నిర్జనప్రదేశమందే యుండుననియు నుడివిరి. అటులనే యెవ్వరును సంచరించని యీఘోరారణ్యమునకు నన్ను రప్పించినది.

(అని దగ్గరకుఁబోయి మరలఁ జూచును.)

దొంగ—(పైరీతిగనే యుండును.)

కాంతా—అయ్యో! దైవమా! నాకింక తెరువెయ్యది? ఆదుర్బుద్ధి వారినుండి తప్పించుకొని ప్రాణముల నిల్పుకొంటినిగదా యని సంతసించితిని. ఇది భూతమో అడవిమనుష్యుఁడో? ఇప్పు డిచటనుండి తప్పించుకొను నుపాయము దోఁచక మిగుల భీతిఁ గొల్పుచున్నది. (ముందుపోయి వెనుకకేగును)

దొంగ—(పైరీతిగనే యుండును.)

కాంతా—(దొంగమోమును జూచి) అయ్యో! ఆవలకుఁ బోవుదమన్న నీభూతమును జూచినదిమొదలు కాళ్ళు వడకుచున్నవి. భీతి గొల్పుచున్నది. నాకేమియుఁదోఁచుట లేదు.

(అని మెల్లగ నావలకుఁ జరుగిడును. లోన పెద్దధ్వని గల్గును.)

దొంగ— కీర్తన.

సిక్కేవు సిక్కేవులే - సక్కానిపిల్ల ॥సి॥
ఎక్కడికిబోతావు? యేందది సెప్పింక - యెల్లిన నిన్నిడనే పిల్లో
యెల్లిన నిన్నిడవనే
పెళ్ళినన్ను చేసుకుంటు వాళ్ళెల్లసామ్ములెడతి - కల్లంగ తెచ్చి
పోత్తనే పిల్లో పిల్లో ॥సి॥
సక్కజిత్తులమారి - నా మొట్టిపిల్లో సిక్కేవు సిక్కేవులే
పిల్ల పిల్ల పిల్లో సిక్కేవు సిక్కేవులే సక్కానిపిల్ల ॥సి॥

కాంతా—(స్వ) ఏమిది! వీడు సిక్కముగ మనుష్యుఁడేయై యుండును

దొంగ—(స్వ) తొలింబరంగ నన్ను నూసి పేణేశా ! అన్నది నానంత సొగ్గావుండా గామాల్నో? కామించినా నోకు. నాటాకు. నాటికు. నన్ను మొాయించి పేణేశా ! అంటా నాయెంబడి వడ్డది. నానంత సొగ్గా వుండా గామాల్నో?

(అని వికటముగ నవ్వును.)

కాంతా—ఓరీ ! నీ వెవ్వఁడవు ?

దొంగ—నేనే.

కాం—నేనే యన యెట్లు తెలియును ? వివరముగఁ జెప్పుము.

దొంగ—యహై ! నేనే నంటే తెల్దు ?

కాంతా—బాగుగానున్నది. పోసీ నీవర్ణ మేమి ?

దొంగ—నావర్ణము నీలవర్ణమే.

కాంతా—సరి సరి అడవి మనుష్యుఁ డన్నందుకు సరిపోయినది. (వర్ణ) వర్ణమనగా కులము, తెలసినా ?

దొంగ—అట్టా సెప్పరాదూ ? మరి మబ్బేటకులం.

కాంతా—మబ్బేటకులమనగా నేమి ? సరిగా జెప్పుము ?

దొంగ—యహై ! మబ్బేటకులమంటేను.

కాంతా—నీవృత్తి యేమి ?

దొంగ—ఇదే.

కాంతా—ఓరీ ! ఇంక నీతోవన నీవుఁ బొమ్ము. అధికప్రసంగము తో బనిలేదు.

దొంగ—ఇదిగో ! మరిగత్తే పేణేశా ! అని నన్ను మోహించి నా యెంటబడి యిప్పుడేడకెల్తా ? నన్ను పెళ్లి సేసుకోవు?

కాంతా—నీకుఁ గావలెనా ? నిరూపము నకుఁ బెండ్లి యే తక్కువ సుమా ?

దొంగ—తక్కువో? యెక్కువో? నన్ను పెళ్లి సేసుకుంటావా లేదా?

కాంతా—ఒరీ! నీకొక్కమాట జెప్పెద వినుము. (స్వ) వీనిబారి
నుండి యెట్లుగా తప్పించుకొందును? యేమియుఁదోఁచుటలేదే?

దొంగ—యేందది? సెప్పు సెప్పు యింటాను.

కాంతా—పెండ్లి సేసుకొనుటకు నీకును నాకును భేదముః గలదుః
అందుచే కుదరదు.

దొంగ—బేదం అంటే.

కాంతా—నల్లనిరూపుచే చూచుట కసహ్యముగ మలినవస్త్రముల
తో నుందు వీకెట్లుగా పెండ్లి యగును?

దొంగ—నాకంటె సోగ్గావుండా వేం? యిదగో! మాటినూ.

కీర్తన.

నల్లోడునైతేను=నాకేమని అంటారు? నామాట యినవే పిల్లా
చక్కానిపిల్ల నామాటయినవేపిల్లా.

హాయ్ హాయ్ చీరాము లెట్టుండనే? చెప్పవే పిల్లో చీతమ్మ
యెట్టుండనే?

పిల్ల పిల్ల పిల్లో కుక్కమూతి యెట్టుండనే? చెప్పవే పిల్లో చె
ప్పవే పిల్లో? రుక్మిణమ్మ యెట్టుండనే?

కాంతా—నీకు నిజముగా పెండ్లి కావలెనా? అట్లయిన షోకుగా ఉండ
వలెను, మంచిడ్రెస్సులు వేసికొని బంధుసహితముగా రావలె.

దొంగ—బందుచహితం అంటే?

కాంతా—చుట్టాలతో గూడా.

దొంగ—అట్లాగే పిల్చుకొత్తాగాని నువ్వొల్తాయేమి. యెత్తే?

కాంతా—వెళ్ళునుగాని మంచిడ్రెస్సులతో గూడ రావలెను.

దొంగ—మంచియి లేయే నాకు.

కాంతా—ఐన పోయిరమ్ము.

దొంగ—యెల్తాయేమి.

కాంతా—నే నిచ్చటికిఁ బోయెదను. నీకొఱకై యిచ్చటనే యుండె
దను. శీఘ్రముగ రమ్ము.

దొంగ—నువ్వెల్తాయేమి. ఇదిగో నీపేరేంది. సెప్పమరి?

కాంతా—రాజాధిరాజసార్వభౌమ ప్రతాపసేనరాజేంద్రుని దేవేరి
యగు కాంతామతీదేవి.

దొంగ—అబ్బో! అంతపెద్దదా? నాకు రాదు సిన్నదిసెప్పు?

కాంతా—ప్రతాపసేన రాజేంద్రునిభార్య, కాంతామతీదేవి.

దొంగ—బాబో! యింకాపెద్దదే యింకోటిసెప్పు?

కాంతా—సరే కాంతామతీదేవి.

దొంగ—ఊహూ! యింకాసిన్నది?

కాంతా—కాంతామతి. అది నాకురాదే?

కాంతా—నేఁ జెప్పెద పల్కుము. కాం తా మ తి (ఒక్కొక్కయక్ష
రముఁ జెప్పును.)

దొంగ—పైరీతిగాఁ బల్కును. (కొంతసేపటికి వ్రేళ్లు లెక్కపెట్టుకొని)
గంత గంత గంత యింకరాదు.

కాంతా—పోనీ యట్లనే పిలువుము.

దొంగ—(స్వ) గంత గంత గంత యిదిగో! యిదిగో యెల్తాయేమి;

కాంతా—నేనిచ్చటికి వెళ్లను. నీవుమాత్రము తొందరగా రావలెను.

దొంగ—యెల్తుండ. పోతుండ. మల్లొత్త. నూవెల్తాయేమి.

కాంతా—అబ్బ! పొమ్ము. నమ్మవా? నమ్ముకున్న నీకింతియే.

దొంగ—యెల్తుండ. పోతుండ నువెల్తాయేమి అట్లాకాదు, నేగిరిగీసి
యెల్తా. (కాంతామతి చుట్టు గిరిగీసి ఉమ్మి వేయుచు పోవఁ
బ్రయత్నించి) యిదుగో! యెల్తా. బోతాను. వెల్లమాక. నా
నిప్పుడే వత్తా. (నిష్క్రమించును.)

కాంతా—అబ్బా! వీనిబాధ పడలేక విసిగి పోతిని. వీనిఁజూడ నవ్వును, నాగతిఁ దలంచ దుఃఖమును వచ్చుచున్నది. (అటు నిటు జూచి) నేనింక యిందు నిలువఁ జనదు. మరల యీమూర్ఖుఁడు రాఁగలఁడు. వాఁడు రాకమున్నె వేరొకమార్గమునఁ బోయెద. హా! దైవమా! ఎట్టి యిక్కట్టులఁ బెట్టుచుంటివి?

[పునఃప్రవేశము-అదే స్థలమున దొంగ, వానిబంధుగులు మేళముతో]

1 అన్నా! మా వదినేదీ?

2 మామా! మా అత్తేదీ?

3 బావా! మా అప్పేదీ?

4 తమ్ముఁడా! మఱఁదలేదిరా?

దొంగ—యహ్హే! ఉండదిలే అరవమాకండరి.

(బంధుగులందఱు కలసి పాటలు పాడుచు పంచరంగులు దెచ్చి ముఖమునకు, శరీరమునకు రాచెదరు.)

1 అన్నా! మావదిన యెక్కడ నున్నదో తీసుకురా?

దొంగ—అల్లదుగో! ఆపొదసాటున కూకొబెట్టే. సెయ్యిపట్టిలాక్కురా. పో.

1 (పోయి చూచివచ్చి) ఎల్లిగ మల్లిగ పుల్లిగో! అంతా వుత్తదేరో దొంగదవ. మన్ని కూడా తీసుకొచ్చావు. (అని కొట్టును)

అందఱు—యెదవా! అబద్దాలు సెప్పి పిల్సుకొత్తావా (అని కొట్టి నిష్క్రమింతురు)

దొంగ— గంతా! ఓగంతా! ఓగంతా! (అని యేడ్చుచు) సీతల్లెమ్మ దిగ్గొయ్యి. మాయమాటలు సెప్పి మంచిడెరును వేసుకురామని సెప్పకుండల్లే? నిన్ను యడియిలో పట్టుకోకపొయ్యానంటే నేదొంగనేనా? మరిగత్తెనేన్న నేనా? యెల్లా పెళ్లి సేసుకొత్తా

(నిష్క్రమించును. యవనిక జారును.)



శ్రీరస్తు

# కాంతామతి

## పంచమాంకము

ప్రథమరంగము—అడవి, మఱొక భాగము

[ప్రవేశము: కాంతామతి - విషాదముతో]

(అనుబంధము 15)

అయ్యో! నేనెంతపాపురాలను?

చ. వెలయఁగ నున్న దంపతుల ♦ వేఁడగ తెంపులు వెట్టఁ బట్టి భూ
తలమున నట్టిపాపఫలి ♦ తంబాగి నే నను భావ్యమందితిన్
నిలువఁగనిడ లేక మఱి ♦ నీళ్ళును, కూడును లేక సర్వదా
ములఁ జరియించుచుంటి నిఁక ♦ నింతలు జర్గునటం చెఱుంగనే.

కట్టా! దైవమా! ఇంతవఱకు ముప్పురచేఁ బడరాని పాట్లు పడితిని. ఇఁక ముందైన నాకష్టములు గట్టువట్టునా? ఏమి నావెడఁగు? నాయట్టి నిర్భాగ్యురాలికిఁ గష్టములు తొలఁగునా? కల్ల. నేధన్యురాలనేయైన నాపతిచెంత నే యుండుదానఁగదా? ఇట్టికష్టముల కేల లోనాదును.

గీ. భాగ్యహీనను గాఁబట్టి ♦ పతిని వీడి
కుంది కృశియించుచుంటి నా ♦ డెందమందుఁ

గటకటా! కాననముల నా ♦ కంజజాతుఁ
డుండుమని వ్రాసెఁ గాఁబోలు ♦ నొప్పిదముగ
మూఁడువంక్తుల నుదుట న ♦ మ్మదముతోఁడ.

హా! ప్రాణనాథా! నీ సుందరవదనారవిందముఁ జూచు భాగ్య మీజన్మమున నిర్భాగ్యురాలనగు నాకుఁ గలదా? కల్ల. మందభాగ్యురాలనగు నేనెట్టిపాపము లొనర్చితినోగాని ఎందుఁ జూచినను అన్నియు నశుభములే. ఎందుఁ బోయినను అన్నియు సంకటములే. ఇంక నేనేమి సేయుదు? హా! ప్రాణేశ్వరా! నీప్రియ కాంతను కావరావా ?

ఉ. నాథుని మెట్టినిల్లు మరి ♦ నాతలి దండ్రుల సోదరాదులన్
మోదముగూర్చు నాసఖుల ♦ ముచ్చటలాడెడు రాజకీరమున్
నాదయివంబు జాలక న ♦ హా! విడనాడి యహర్నిశంబు లీ
బాధలనందనాయెఁ? నీకఁ♦బ్రాణము ♦ బోదుగదాయొ? దైవమా!
హా! నిర్భాగ్యురాల నిర్భాగ్యురాల (ముందునడచును).

[ప్రవేశము: రాజకుమారులు ఇద్దరు ఒకవైపున]

1. మిత్రమా! నీకన్న నెక్కుడు మృగముల నేనే సంహరించితిని.
2. ఇట్టి యనృతము లాడకుము. నివా మృగములతోఁడఁ బరుగిడఁ జాలకుండుటచే ప్రతిమృగమును నేనుగదా కోలంగూల్చినది?
1. వీటికేమిగాని అటుఁజూడుము.
2. ఔరా! ఏమి దాని యొయ్యారము ? నామనము తత్తరించుచున్నదే?

మ. అరవిందంబులు జూడు కన్గవలు ♦ లాభ్రింబనా ముంగురుల్
శరదిందుప్రతి బింబమా ముఖమరే! ♦ సర్వాంగ సౌందర్యమున్
యరరే! వర్ణన సేయజాలను—బళా! ♦ యాయింతి సింగారముల్
ధరలో నెవ్వతెకైన నుండెనె? సఖా ♦ తథ్యంబు మాహింపుమీ?
1. మిత్రమా! ఏమీ దానిసోయగము? ఔరా! ఎంతవన్నెలాడి?

సీ. కమలజారికి కళం ♦ కము గలదంచని
యొకపక్క మూడు నీ ♦ సకియమోము
కంబుజంబునకు నో ♦ యగమస్థిరంబని
నిరసించు నీకాంత ♦ నీటు గనులు
కుంద కుట్మలములు ♦ కుదురుగా లేవని
యదలించు నీతన్వి ♦ రదనపంక్తి
చక్రవలాకృతి ♦ సరసంబు లేదని
సైగజేయుఁ బోలంతి ♦ స్తనయుగంబు
గీ. ఇట్టి శుభరూపలావణ్య ♦ మింతులందు
జూచియుండను - జూడను ♦ జూడబోను -
నీశుభాంగినిఁ జేపట్ట ♦ నిహమున వరము
గలదు పురుషుల కరయంగఁ ♦ గలియుగాన.

ప్రచండ! దాని మాటలాడించి చూతము రమ్ము. (దాపుఁజేరి) లీ! నీవెవ్వరిదానవు? ఒంటరిగ నీఘోరాటవులం దిరిమ్మరు కారణమేమి? నీమగఁడెవండు? సర్వముఁ దెల్పుము?

కాంతా—అన్నలారా! కర్మవశమున నీయరణ్యములఁ దిరిమ్మరు చుంటిని. నావిచారణ మీకేల? మీమార్గమున మీరు పొందు

2 (కనుసైగ జేయును.)

1. చెలీ! నీకథయెల్లఁ జెప్పక దాచితివి. కానిమ్ము. వంటయింటి కుందేలువలె మాచేఁజిక్కితివి. ఇంకెందుఁబోఁగలవు?

(అనుబంధము 16)

2. సీ. నిను జూసి నేసింక ♦ నిలువజాలనె బాల
కోరికఁ దీర్పవే ♦ సుందరవదన!
కనకాంగి! నీ నీటు ♦ గన్గొన మదికి సం
తాపమాయెనికెట్లు? ♦ దాపు దరకట!

2. సరసిజనేత్రి! నీ ♦ సౌందర్యమారసి
నంత, కలఁగఁ జెంది ♦ నబ్జపాణి !

1. సతులననేకుల ♦ క్షితితలంబునఁ గంటి
గాని నిన్బోలిన ♦ కాంతఁజూడ

2. గీ. మోవి చక్కెర రుచిఁజూపె ♦ ముద్దుగుమ్మ !

1. నీదు కౌఁగిట నను జేర్పు ♦ నీలవేణి !

2. మరునిదాడికి నోర్వనో ♦ మందయాన !

1. నన్నుఁ గరుణించి బ్రోవవే ♦ వన్నెలాడి !

2. కలికీ! మాకోరికఁ దీర్పనిది నిన్ను విడుచుటకల్ల. కావున నీ వీ కార్యమున కంగీకరించుము.

కాంతా—హరిహరీ ! (చెవులుమూసికొని) ఎంతమాటాడితిరి.

శా. అన్నా! మీకును నేనుసోదరిని మీ ♦ యంఘ్రుల్ దగఁగొల్చెదన్
నన్నీరీతిని గోరఁగాదగునె ? యు ♦ న్యాయంబుగానిల్లు, గా
కున్నన్ మీకిలఁదోడబుట్టువులు లే ♦ రో? వార లిమ్మార్గమం
దున్నారా? యది చెప్పుఁడీ ? విదవమీ ♦ దుర్వ్యోశ్వగుల్ గాకొకో.

మీరు రాచవంశజులుగారా ? ఏమోనట్టి. రాచవారైనవారిలో నింత జ్ఞానహీనులుందురా? లేకేమి? కొందఱు వావివరుసలెఱుంగని పశుప్రాయులుగలరు. రాకుమారులారా! మీకిబుద్ధితగదు. మీ త్రోవను మీరుపొండు. పాపము చాలభ్రమపడిమంచినీతి నొచ్చితిరి. మీకునీతి జెప్పువారులేరా? మీపెద్దలకును నిదియే నడవడియా? ద్రోహులారా !

1. కాంతామణీ! వేయిమాటలాడుటవసరముగాదు. ఎట్లైన నంగీకరింపక తప్పదు. లేకున్నఁగుక్కచంపురీతి యని యెంచుము. ఇంక జాగుసేయక లెమ్ము. ఆసోదరింటికడకు బోవుదము.

కాంతా—

గీ. పరసతులపొందు భువిఁ గడు ♦ పాపమనుచు
చెప్పియుండరె ? యార్యులో ♦ చెనటులార!
యఘముగల్గును మీకింక ♦ నాయువుడుగు
పొందు టెంకికి వేగమె ♦ పొద్దువోయె

2. ఇందువదనా ! పరసతులపొందు పాపమని యెందువ్రాసియుండి నది ? చూపఁగలవా ? ఉండదనపో. తెలివిహీను లెవ్వరో వ్రాసి నదిగాని తెలివిగలవారలు వ్రాసినదిగాదు.

కాంతా—అవును. వారు తెలివిహీనులు· మీరు తెలివిగలవారు కను కనే యింక నీతితప్పక సంచరించుచుండిరి. లోకమున నింకెవ్వ రైన తెలివిహీనులుండిన మీకడనున్న తెలివిని బోధించి మీ యంత బుద్ధిమంతులుగ జేసి మీవెంటనే త్రిప్పుకొనుచు యశ మార్జింపుడు.

1. గీ. మాటలేల ? ముమ్మాటికి ♦ మరునికేళి
దేల్పు నన్నింక జాగేల ♦ దెసవమిత్తు (పట్టుకొనఁబోవును)
2. వానిమాటలవేమికే ? ♦ వనరుహాక్షి
నన్నుఁగూడితో వేవేగ ♦ నిన్నుఁగొలతు.

(పట్టుకొనఁబోవును)

కాంతా ! నన్ను వివాహమాడుము, నీకెందును లోపములేదు.

1. తన్వీ ! నన్నుఁ జేపట్టుము. నీకు సర్వాధికారమొసంగెద.

కాంతా—(స్వ) వీరికెన్నినీతులు జెప్పినను వినక నన్ను భంగపెట్ట నెంచిరే ? కానిమ్ము; వీరిని కపటోపాయమునఁ దప్పించుకొను నుపాయము బన్నెద. (ప్ర) రాకుమారులారా ! మీకు నిజ ముగ వివాహము గావలెనా ?

1. నాకుఁ గావలెను.

2. నాకుఁగావలెను. (మొదటివానిని నెట్టును.)

కాంతా—రాచకున్నలారా! మీరు చిన్నవయస్కులు. నేనన్ననో పెద్ద వయస్కురాలను. మనలకు వైవాహికం బెట్లు పొసఁగును?

1. కాంతా! నీకన్న నేనే పెద్దవాఁడను, చూడుము.

(అని మీసములు జూపును)

2. తరుణీ! నీకన్నను వీనికన్నను చాలాపెద్దవాఁడను. నీవు విచారించి మరి కేలుబట్టుము. [మొదటివానిని నెట్టివేయును]

కాంతా—ఔను! మంచియుక్తవయస్కులు నాకు లభించిరి. అతఁడు బాలుఁడు. నీవు వృద్ధుఁడవు. మంచిదాంపత్యము. మీతోటిదాంపత్యము గడుసౌఖ్యముగనుండును, చాలు చాలు పొండు.

(పోవఁబోవుచు రాకుమారు లడ్డమువచ్చి నిర్బంధింతురు.)

కాంతా—[స్వ] వీరలనింకకపటోపాయమునఁదప్పించుకొనవలయును. [ప్ర] యువకులగు నో వీరులారా! మీకు నిజముగ నాపైఁ బ్రేమ యున్న నేనొక్కటిఁ జెప్పెద. అందుల కంగీకరించి మీర ట్లొనర్పవలయు. అట్లు జేసెదరా?

1. అట్లు నే జేసెద.

2. నీయిష్టమగునట్లు నే ముందు జేసెద.

కాంతా—అట్లయిన ముందు మీదుస్తు లిందుంచుఁడు.

1. 2. ఇదిగో! ముందునావి. ముందునావి. (విడిచి క్రిందనుంతురు.)

కాంతా—ధనుర్బాణములఁగూడ నిందుంచుఁడు.

1. 2. ఇదిగో! ముందునాది. ముందునాది. (ధనువులఁగూడ క్రిందఁ బెట్టుదురు.)

కాంతా—ఇంక వినుఁడు, నన్నుఁ బెండ్లాడఁదలఁచుకొన్నది నిజమేగదా?

1. 2. నిజము. నిజము.

కాంతా—అట్లైన వినుఁడు. ఈశరమును రివ్వున వేసెదను. దాని ముందుగ నెవ్వరుదెచ్చిన వానిఁ జేపట్టెదను. ఇదుగో బాణము! విసరుచుంటిని. (బాణముఁ దీసికొని ఒకవైపునకు విసరి వేయును. రాకుమారులు పరుగెత్తుదురు) మొన్నబుట్టి, నిన్న కన్నులుదెరచిన వారికిఁగూడ భార్యగావలసివచ్చె. కనుక నే లోకమెల్ల యున్నవ్యాధులు వ్యాపించి నానాట క్షీణించి కడకు మృతులగుచున్నారు, తమ దేహపటుత్వము తామెఱుంగక సంచరించు నిట్టి మూర్ఖులగతు లెట్లుండవలెనో యట్లనేయుం దును. మరచినాను, ఆమూర్ఖులు రాకమున్న యీ దుస్తులను ధనువులనుధరించి పురుషవేషమున ముందుమార్గముఁ బట్టెద.

(దుస్తులను ధనువును దీసికొనిపోవును)

[పునః ప్రవేశము: రాజకుమారులు, అదేస్థలమున]

1. (చూచి) అన్నా! ఎంతమోసగించినది? ఎన్నోనమ్మికలఁ జెప్పి నమ్మించుటయె గాక దుస్తులను ధనువులఁగూడ గొనిచనెనే? కనుకనే స్త్రీజాతిని విశ్వసింపఁ దగదనియు, కంఠముఁగోసినను నమ్మరాదనియు పూజ్యులగు పెద్దలు నుడివియుండిరి.

2. అన్నా. ఆకాంతను వెదకి సేవ జేసికొనుము

1. నాకేమియువలదులే? నీవే జేసికొనుము.

2. ఆ మఃగతిపెండ్లివలెనే యున్నదిలే? మనదుస్తులతో సహా గైకొని పోయినది. ఇంక మనమెట్లు పురములోనికిఁబోవుదుము? దుస్తులులేక పురముఁ జేరితిమేని చూచువారెల్లరు మనల వింతగజూచుటయెగాక, దుస్తుల నెందోగోల్పోయిరని గొల్లు పెట్టెదరు. కాన నెట్లైన యీకాంతారమందు నాకాంతను నెమ కుదము రమ్ము.

1. అన్నా! మదాంధకారముచే మన మాకాంతను గోరుటచేతనే గదా? మం కిట్టికష్టములు గల్గినవి? పరనారులను గోరుట పాపమనినుడివియే యుండినది. పాపమూమెల్లోన మేమియు లేదు. అన్నా! ఆ పాపమిప్పుడు మనపైఁ బరిణమించినది ఇంకను మమ్ములఁ దెచ్చుకొనుటకై యానారి పోయిన మార్గముఁబట్టి పోవుదము రమ్ము మన గ్రహచార దేవత యిట్లు జేసినదిలే.

(నిష్క్రమించుచును యవనికజారును.)

---

## ద్వితీయరంగము ఉద్యానవనము.

[ప్రవేశము:— కాంతామతి పురుషవేషమున శయనించి]

[పుష్పమాలఁగోయుచు చంద్రరేఖ కొందఱు చెలికత్తెలు ఒకవైపున.]

(అనుబంధము 17.)

చెలి— సఖీ! చంద్రరేఖా! నీమదికి నచ్చిన పురుషసింహుఁడు నేఁడు గదా లభించినది? అదుగో! ఆ లతాకుంజముల చెంత శయనించి యుండిన సౌందర్యమూర్తిం జూడుమా? ఆహా! ఎట్టిసుందర వదనారవిందము?

చంద్ర— (చూచి) ఔనె చెలీ! ఇదివఱకెందఱనో రాజకుమారులఁ జూచి యుంటినిగాని యిట్టిసౌందర్యమున వీనికిపట్టగు నవమన్మధాకారుని గాంచఁ జాలనైతి? ఔరా! ఏమి వీని సౌందర్యము.

[అనుబంధము 18]

ఉ. “కంతునికంటె నైషధుని ♦ కంటె వసంతునికంటె యామినీ
కాంతునికంటె దత్త్రుతుని ♦ కంటెఁ గుబేరునిపట్టికంటెఁ బా
కాంతకసూతికంటె లలి ♦ కాకృతినొప్పుచునుండు, మదిని
కాంతుఁడటంచు నాకు చెలి, ♦ కాంక్షలుగల్గెను వేయునేటికిన్”

చెలి !

ఉ. " వీని ముఖంబు చందురుని ♦ వెల్వెలఁ బారఁగఁ జేయుచుండగా
వీనివిలోకనంబు లర ♦ విందములన్ ముకుళింపఁజేయగా
వీని భుజద్వయంబు ఫణి ♦ వృద్ధుని నాదలవంపఁ జేయగా
వీనివిలాస సంపదతి ♦ శిష్టపసన్నుత మాటచిత్రమే ?"
మరియు

కం. చిందమ్ముల కుందమ్ముల
కందమ్ముల గెల్చువీని ♦ గళ రద కచముల్
కెందమ్ముల కుందమ్ముల
చందమ్ముల దనరువీని ♦ చరణము లెన్నన్."

చెలి—రమణీమణి! చక్కగా వర్ణించితివి. నీవు చెప్పినట్లన్ని లక్షణము లచే విలసిల్లుచుండె. ఈతఁడే నీకుఁ దగిన పురుషుఁడు.

చంద్ర—కాంతా ! ఈతని యాకృతి చూడ మోహసముద్రమున ముంచుచున్నయది. ఇంక నీమోహము నేభరింపఁజాల. ఇటు విలోకింపుము.

సీ. " వసనప్రభూత లా ♦ వణ్యాంబుసంభూత
కమలంబులన వీని ♦ కన్నులమరె
నిక్కవీనులవాఁడ ♦ నెక్కపక్కములాడు
కరణి నున్నవి వీని ♦ ఘనభుజములు
సంకల్పసంభవా ♦ స్థాన వేదికవోలె
వెడదయై కనుపట్టె ♦ వీనియురము
ప్రతిఘటించు జివుళ్ళ ♦ పై నెత్తువాఱిన
రీతి నున్నవి వీని ♦ మృదుపదములు

గీ. నేరకేటియసల్ దెచ్చి ♦ నీరజాప్తు
సానబట్టిన రాపాడి ♦ చల్లిమెదిపి

వదను సుధ నిడి ♦ చేసెనో? వద్మభవుఁడు
దీని గాఁ జున్నఁ గలదె ? యీ ♦ మేని కాంతి."

[కాంతుఁడు మేల్కాంచి.]

కాంతలారా! మీరలెవ్వరు ? మీనామ మెద్ది ? ఇందు రాఁగతమేమి ?

చెలి—ఆర్యా! ఈమె కళింగాధీశుని పుత్రి. చంద్రరేఖ. మే మామె యనుంగు సఖులము. వనవిహారార్థమై యిందు వచ్చితిమి. మీనామ మెయ్యదో? స్థాన మెయ్యదో? కులగోత్రము లెవ్వియో? సెల వీయ వేడుచున్నారము. మీకుఁ గళ్యాణమగుఁగాక.

కాంతు—(స్వ) ఏమి! యీ చెలి యిట్లు భాషించుచున్నది ? (ప్ర) కాంతా! రాట్కుల సంజాతుండ. కుంతలపురీశుని పుత్రుండ.

చెలి—దేవా! తమనామముం దెలుప ప్రార్థించుచుంటి.

కాంతు—నా కులగోత్రనామము లడుగుచుంటి వేల? నాతోడ సంబంధ మొనర్పదవా ?

చెలి—(నమస్కరించి) దేవా! యాగ్రహింపకుము. ఒక మనవి గలదు. మీ రంగీకరింతు రేని యుగ్గడించెద.

కాంతు—అంగీకరింపఁదగినదైన నంగీకరించెదను.

చెలి—(చంద్రరేఖనుఁ జూచి కన్నుగీటును.)

చంద్ర—ఆర్యా! ఈ కళింగపురాధీశ్వరుండగు మా తండ్రి ముదుసలి యగుటచే రాజ్యతంత్రము కుశలముగ నడుపదగు రాకుమారుఁడు లభింపమిం జేసి సంతాపమందుచుండె. మరియు నా—

[తలవంచి సిగ్గుపడును]

కాంతు—తరుణీ! లజ్జించెద వేల? యిది లజ్జించు మాట కదా? చెప్పఁదలఁచిన దాని సాంగముగాఁ జెప్పుము. ఇం దన్యు లెవ్వరుండిరి ?

చెలి—అయ్యా! ఈ రాజ్యభారమును మీ భుజస్కంధముల నిడుకొని యీమెను వివాహమాడుమని యీమె కోరిక. మీ రిందుల కంగీకరించి యీమెనుఁ జేపట్టవలయును.

చంద్రి—(చెలిక త్తెను చాటుచేసికొని) భూజానీ! ఇదియే నాకోరిక. ఇంక నాముద్దుచెల్లించి నాకును యీకళింగరాజ్యలక్ష్మికిని నాథులగుదురుగాక యని ప్రార్థించుచుంటిని.

కాంతు—సఖీ! నీకోర్కెయుండొండు తీర్చెదను. రెండవదాని యర్థవత్సరమునకుఁగాని దీర్పఁజాల. మన్నింపుము.

చంద్రి—ఆర్యా! ఇట్లు సెలవీయఁదగునా? మీ రిప్పట్ల దీర్పఁగల్గిన కార్యమెద్దియో సెలవీయ వేడుచుంటిని.

కాంతు—కలికీ! నీతండ్రి వృద్ధుఁడగుటచే రాజ్యభారము మోయఁజాలకుండెనని బల్కితివిగదా? కాన ప్రస్తుతమందీ రాజ్యరమకు నాయకుఁడనై ప్రజాపాలనముఁ జేసెదను గాని యారుమాసములవఱకు నిన్నుఁ బరిణయమాడఁజాల.

చంద్రి—కారణము సెలవీయ వేడెద.

కాంతు—ఏమని చెప్పుదును. ప్రియకాంతావియోగము సంభవించుటం జేసి యీగతిఁ జెప్పితిని.

చంద్రి—కాంతావియోగము మీకెట్లు గల్గె?

కాంతు—కాలవశమునఁ ఘోరాటవులఁ దిమ్మరుచుండ నందు ప్రియకాంతను గోల్పోయి యెంతైన నున్నజాడ కనుగొందమని యిట్లు దిమ్మరుచుంటి. కావున్ నీకోర్కెదీర్చ రాజ్యపాలన జేయుచు నిందే యుండి నా కాంతను వెదకఁదగు వారింబనిచెద.

చంద్రి—చిత్తము. తమదయ.

చెలి—అమ్మా! చంద్రరేఖా! చాల జాగైనది. రమ్ము పోవుదము.

చంద్రి—ఆర్యా! పురమునకుఁ దయసేయుడు.

కాంతు—మంచిది పోదము.

చంద్రి—రండు పోదము. (అందఱు నిష్క్రమింతురు)

(యవనికజారును.)

## తృతీయరంగము—రాజాస్థానము.

[ప్రవేశము;—కాంతుఁడు ఆసీనుఁడై]

రాగావళారసీసము.

ఆహా! యేమినాగతి ?

సీ. శంకరాభరణంబు ♦ జగతిభారంబుదాల్చు
రీతి భూభార మే ♦ రీతిమోతు?
మోహనాకార నీ ♦ ముద్దుమోమును జూచు
భాగ్య మెప్పటికిల ♦ భ్యంబుగల్గు?
భూపాలచంద్ర యా ♦ పాపపువిధియష్ట
కష్టముల్ పాల్ జేసి ♦ గాదె నన్ను ?
కన్నడ యేల? నన్ ♦ గాచిరక్షించుట
కిది మంచిసమయము ♦ మికేల జాగు ?
గీ. తోడివారలుజాల సం ♦ తోషవార్ధి
నోలలాడుచునుండిరి ♦ యోపరిలక
నోలిమిక మీపదంబుల ♦ నోలగించు
భాగ్యమబ్బును లేదో ♦ యీపాపికింక

ఆహా! నేనట్టి నిర్భాగ్యురాలను? పడరాని యిడుమల బడి నేటికి కపటవేషధారినై కాంతుఁడనుపేర కాలము గడుపుచుంటి. నాకపట కృత్యమెఱుంగక చంద్రరేఖ తన్నువివాహమాడుమని బల్కుచున్నది. ఆమె సుందరవదనారవిందముఁగాంచినపుడెల్ల లజ్జించుచుంటి. నే జెప్పిన గడువు సైతము తుదముట్టవచ్చినది. నాప్రాణకాంతునిజాడ యొంగును గాన్పింపదయ్యె. ఇంక నేనేమిసేయుదాన? నాకింక దిక్కెయ్యది?

ఓలక్ష్మీవల్లభా! లోకనాయకా! ఆర్తజనశరణ్యా! ఇంకనా నాథుని నాకుంజూపకున్న నీప్రాణములఁ బాయుదాన. ఓజనార్దనా!

కంసమర్దనా! పతిభిక్షపెట్టి నన్ను రక్షింపుమా? గరుడసైంధవా! వైకుంఠవాసా! దిక్కులేని నాయట్టి దీనురాండ్రకు నీవేగదా దిక్కు? పుండరీకాక్షా! యింక రక్షింపుము. (చూచి) ఎవడురా?

[ప్రవేశము, సేవకుఁడు.]

అయ్యా! సేవకుఁడు.

కాంతు—ఓరీ! నీవింక కారాగృహముచెంతకు జని యాకారాగార కుడ్యముపై వ్రాసిన చిత్రపటముఁజూచి యెవ్వరైనను దుఃఖించినను మోహించినను ఏకదృష్టినిఁజూచినను వారినెల్లర కారాగృహమునందుంచుము. ఇది యే నాయాజ్ఞ! జాగ్రత. మరచితిని. ఎవ్వరేని మాని వేషధారులువచ్చిన వారిని సన్మానించి యుచితాసన మొసంగుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

కాంతు—నేనించుకంత విశ్రాంతిఁ జెందఁబోయెద.

[నిష్క్రమించును. యవనికజారును]



తురీయరంగము—కారాగృహము.

[ప్రవేశము:—సేవకుఁడు. ఖడ్గహస్తుఁడై]

రాజులయెడ సేవకావృత్తి మిగులఁ కష్టతరము. "కోపమువచ్చిన కొఱికి చంపుదురు. లేనిచో నాకిచంపుదురు." యట్లైననుచావే? ఆజ్ఞ! "ఈచిత్రపటముఁజూచిదుఃఖించువారి కారాగృహమందుంచ"మని. ఇచటికనేకులు వచ్చిరిగాని యీపటమును జూచి దుఃఖించినవాఁడొక్కఁడును లేడు. ఇందుఁ గాచియుండలేక చచ్చిపోవుచున్నాఁడ. ఇందీపటము నాచావుకొఱకేవ్రాసినారు, ఇందు నిందరుండ గావలికి నేనేదొరకితినా?



(ప్రవేశము—ఉత్తమశీలుఁడు)

[అనుబంధము 19]

(చిత్రపటముంగాంచి) హా! తరుణీ! కాంతామతీ! మోసపోయితినే ?

సేవ—ఎవరు నీవు?

ఉత్త—నేను వైశ్యుఁడను.

సేవ—ఈపటముంజూచి ఏలదుఃఖంచెదవు ?

ఉత్త—అయ్యా! ఈమె యిప్పు డెందున్నయది ?

సేవ—కావలెనా ? చూపెదరమ్ము. (అని కారాగృహమందుంచును)

[ప్రవేశము—దుష్టబుద్ధి.]

(అనుబంధము 20)

(చిత్రపటముగాంచి) హా! కాంతా!

సేవ—ఓయీ! నీవెవ్వఁడవు ?

దుష్ట—నేను క్షత్రియుండను.

సేవ—ఈపటముఁజూచి యేలదుఃఖంచెదవు ?

దుష్ట—ఆమె నాభార్య. అందుచేత,

సేవ—ఐన యామె నీకిప్పుడు కావలెనా ?

దుష్ట—అయ్యా! యెందున్నది? కావలెను. చూపితివేని నీకు పారితోషికమొసంగెద.

సేవ—అటులైనరమ్ము. (కారాగృహమందుంచును)

[ప్రవేశము—దొంగ.]

(అనుబంధము 21)

ఆ. గంతా! గంతా!

సేవ—ఓరీ! ఏలయేడ్చెదవు ?

దొంగ—గంత. నాగంత.

సేవ—నీకాగంత కావలెనా ?

దొంగ—ఆ. కావాల. ఏదీగంత ?

సేవ—వినరమ్ము. (అని కారాగృహమునందుంచును.)

[ప్రవేశము—రాజపుత్రులు.]

(అనుబంధము 22)

(చిత్రపటముంగాంచి)హా! తరుణీ! మమ్ముమోసముఁజేసి యెందుంటివి?

సేవ—ఎవరువీరు ?

1, 2 మేము రాచబిడ్డలము.

సేవ—ఈపటముంజూచి యేల దుఃఖించెదరు ?

1, 2, మాకీకాంత గావలెను. ఎందున్నది ?

సేవ—నిజముగ గావలెనా ?

1, 2 కావలెను.

సేవ—వినరండు. (అని కారాగృహమందుంచును)

[ప్రవేశము—ప్రతాపసేనుడు, సన్యాసివేషమున]

(అనుబంధము 23)

హా! ప్రాణేశ్వరీ! ఎందుంటివి?(చిత్రపటముంజూచిదుఃఖించును)

సేవ-యతికులేంద్రా! నమస్కారము. ఇచ్చో చిత్రాసనమలంకరింపుఁడు.

ప్రతా—మంచిది. (కూర్చుండును)

[ప్రవేశము—కాంతుఁడు ఒకవైపున]

కాంతు—(స్వ) ఈతని రూపలావణ్యములంజూడ నాకాతనివలెగన్పట్టుచున్నాఁడు. నిదానించిన సర్వముఁదెలియును.(ప్ర) తాపసేంద్రా! వందనములు. ఇంచుక విశ్రాంతిఁజెందుఁడు. సేవకా! ఈపటముంజూచి దుఃఖించినవారి నెల్ల కారాగృహమందుంచితివా ? (ఆసీనుండగును)

సేవ—చిత్తము.

కాంతు—విన వాండ్రెవరునగఁ దోడితెమ్ము. విచారించెద.

సేవ—చిత్తము. (ఉత్తమశీలుని వెలుపలకుఁ దీసికొని వచ్చును)

కాంతు—ఓయీ! నీవెవ్వఁడవు?

ఉత్త—నేను శేరివంశజుఁడను.

కాంతు—ఈపటమునుజూచి దుఃఖించినకారణమేమి?

ఉత్త—అయ్యా! ఈమె నరణ్యమున నొక సేవకుఁడు విడిచిపోవుచుండ వానికి నేకొంతధనమిచ్చి యీయమనుగొంటిని. వీదవనన్నుం గూడుమని యామెను నేనిర్బంధించ యామహాతల్లి నాకుబుద్ధి వచ్చునట్లు నీతులఁదెల్పినది. అంతనే నజ్ఞానమును విడిచి సుజ్ఞానముధరించి అమ్మా! నాధనమెట్లు వచ్చునని ప్రార్థింపయామె వ్రేలినుండు యంగుళీయక మొకటిచ్చి దీని విక్రయించుకొమ్మని జెప్పినది. అంత దానింగైకొని యొకరాజుసన్నిధికిం దీసికొని పోవ నాతఁడది గ్రహించి నాకు ధనమీయకయే పారదోలె. అంతనేను నాద్రవ్యము పోయెగదాయని మతిభ్రష్టుడనై జగ్గించుచు నేటికీపురముఁజేరితిని. ఇంకాఁగల్లి యీపటంబు గన్పడఁజూచి దుఃఖించితిని. అంతియెగాని వేరేమియు నెరుంగ.

కాంతు—మంచిది. ఆవలుండుము. యతికులేంద్రా! ఇందు మీయభిప్రాయ మెట్లుగానుండెను? సెలవొసంగుడు.

పరిత్రా—ఈతఁడు ద్రవ్యనష్టముగల్గుటచే మతిభ్రష్టుఁడనైతినని జెల్పుచుండె. అట్లనే జరుగవచ్చునని నాకుందోచినది. మరియు నామెకును యీతనికిని యేమియు సంబంధముగల్గినట్లు నాకుఁ దోచకున్నయది.

కాంతు—మంచిది. ఓయీ నీవావలుండుము. సేవకా! తర్వాత వానిం దోడ్కొనిరమ్మా.

[సేవకుఁడు దుష్టబుద్ధిని వెలుపలకుఁ దీసికొనివచ్చును]

కాంతు—ఓయీ! నీవెవ్వఁడవు?

దుష్ట — నేను రాజకులోత్తముఁడ.

కాంతు — నీవు రాజకులోత్తముఁడవా? ఐన నీ పాపటమునుగాంచి దుఃఖించనేల ?

దుష్ట — ఆమె నా భార్య గాన —

కాంతు — (కోపముతో) నీచా! నిజముగ నీ భార్యయేనా? సత్యముఁ జెప్పుము. లేకున్న శిక్షింపఁబడుదువు. ఆమె యిందే గలదు. నీవసత్యముఁ బల్కితివేని యామెనిందు రావించి నిజమారసి శిక్షించెద. జాగ్రత్త. నిజముగ్గడింపుము. క్షమింపఁబడుదువు.

దుష్ట — (భయముతో) అయ్యా! నా భార్య గాదు, ఆమె నా పట్టణమునకు వచ్చినది. అంత నేనామెను నిర్బంధించి నా కోర్కెఁదీర్చుమంటిని. అంత నామె యిట్లు బల్కినది. "నేను గౌరీవ్రతము సల్పవలెను. అది సల్పుట కారు మాసముల యారుదినములు జరుగును. అందుల కనేక దానములు లీయవలయు. దాని కగు వ్యయము నీ వొనర్చిన నీకే లభించెద" నని దెల్ప నేనందులకు నా బొక్కసమందుంచిగల ధనమంతయు వెచ్చించితి. పదపడి రాజ్యము సైత మితర రాజుల కధీనముఁ జేసి ధనముఁగొని తెచ్చి యామెకడకుం బంపుచుంటిని. ఇట్లారుమాసములు జరిగినవి. తరువాత నా కద ద్రవ్యము సాంతమైనది. ఆమె నా యారుదినములు జరుగక మున్న యెందో పారిపోయినది. ఎట్లైన నామె దర్శనమైనఁ జేసి కొందమని రాజ్యభ్రష్టుఁడనై యిట్లు దిమ్మరుచుంటిని. ఇందాక మీరూపపటంబు గన్పడ దానిం జూచి దుఃఖించితిని. అంతియె గాని వేరేమియు నెఱుంగ.

కాంతు — ఆర్యా! ఇందు మీ యభిమతమేమి? సెలవొసఁగుఁడు.

వ్రితా — ఇతఁడును రాజ్యమును ద్రవ్యమునుఁ గోల్పోవుటచే నిలువ నీడ లేక యిట్లుగా దిమ్మరుచు వచ్చెనని నా యభిప్రాయము.

కాంతు—ఈతని విషయమై మీకేమియు ననుమానము లేదుకదా ?
వర్తి—ఈతనిమీద దోషమున్నట్లు నాకుదోచుటలేదు.
కాంతు—మంచిది. ఓయీ! నీ వావలకుంబొమ్ము. సేవకా! తరువాత వానిఁ దోడ్కొనిరమ్ము.
(సేవకుఁడు దొంగను వెలుపలకుఁ దీసికొనివచ్చును.)
కాంతు—ఓరీ ! నీవెవ్వఁడవు ?
దొంగ—నేనా ? మళ్ళేటగాణ్ణి.
కాంతు—అనగానేమి ?
దొంగ—దొంగతనమే ?
కాంతు—నీ వీ కటముఁజూచి యేడ్చినదెందులకు ?
దొంగ—ఇదే నేన దొంగతనానికి పోయేతలికి మేడమిందకూకొని ప్యాణేశా ! అన్నది. ఆమోయిన్నేను ఊఁ. అన్నా. ఆమోయిని పైనించి దిగొచ్చింది. అప్పుడు నేనుకుల్లెంగ అడియుకిదోవతీశా. ఆమోయిని అది నా యనకే వత్తుందది. అట్టపోయి అట్టపోయి అడియి మద్దికు తీసికెళ్లే. ఆమోయిని నన్ను పెళ్ళిచేసుకోమని కదలకుండ అడ్డంపొయ్యా. ఆమోయిని యేందోదో చానాశెప్పింది. అయెన్ని నాకుతెల్దు. పెళ్ళిసేసు కుంటావా లేదా? అంటా దగ్గరపోయా ఆమోయిని—
కాంతు—ఛీ ! వెధవా ! ఏంమోయని నీమొఖంమోయని.
దొంగ—ఆ. నిమొకంమోయిని—
కాంతు—ఛీ ! బుద్ధిహీనుఁడా! శరీరముదగ్గరనుంచుకొని మాటాడుము.
దొంగ—మరిగత్తేఆమోయిని—మరిసిపొయ్యా కూసేపుందు.
కాంతు—ఊఁ, దగ్గరకుపోయివావు
దొంద—మరిగత్తే, ఆమోయిన్ని నీకుమంచి డెరునుల్లేవు. అయ్యోనుకుని రామని సెప్పింది. ఆమోయిసి నేను మా యింటికెల్లి యీ డెరును

తేసుకొని మావాళ్ళందరిని బిల్చుకొని బుక్కాయిగిక్కాయి తీసుకొని ఆడికొచ్చేతల్కి ఆదేముంటది ? అమ్మోయిని—

కాంతు—(దెబ్బకొట్టి) ఛీ వెధవా ! దబ్బునఁదేల్చి చెప్పుము.

దొంగ—అమ్మోయిని మావాళ్ళంతా నన్ను దొంగెదవా! దొంగమాటలు సెప్తావా మాకని తలొకదెబ్బ యేశారు. అమ్మోయిని నేను యేడుత్తు అడిఁయిసిబడి పత్తావుండా. యెట్టైన దాన్ని పెళ్ళిసేసుకోవాలని వొచ్చొచ్చి ఆగోడమింద దానిబొమ్మకనిపిచ్చేతలికి అమ్మోయిని యేదువొచ్చి బోర్నేడ్చేతలికి యీయదవలొచ్చి నన్నుగెట్టిగా పట్టుకొని నీకు దాన్ని యిత్తాంరామనిసెప్పి అమ్మోయిని కిటికీలో కూకుండబెట్టేరు, అందులో యీళ్ళంతా వుండారు అమ్మోయిని—

కాంతు—ఓరీ ! తలనొచ్చుచున్నది గదరా ! యింకమాటలాడక ఆవలుండుము. పొమ్ము.

దొంగ—అంతా సెప్పొద్దుమరి—

కాంతు—(దెబ్బగొట్టి) ఆవలకుబొమ్ము జాగ్రత్త. (చరితావసేనుం జూచి) అయ్యా ! వీనినిగూర్చి యేమిజెప్పెదరు?

చరిత—వీఁడు చోరుఁడగుటచే దరిద్ర్యాపేతువలన నిట్లు మాయలంబన్నగని వీఁ డామెయందేమియుఁ కపటమవలంబించి యున్నట్లు నాకుదోచకున్నది.

కాంతు—మంచిది. ఓరీ! నీవావలకుంబొమ్ము. సేవకా! తరువాతవానిఁ దెమ్ము.

(సేవకుఁడు రాజకుమారుల వెలుపలికిఁదీసుకొని వచ్చును.)

కాంతు—మీరెవ్వరు ?

1, 2 మేము రాచబిడ్డలము.

కాంతు—ఇందేలవచ్చితిరి ?

1, 2 అయ్యా! కొన్ని మాసములక్రిందట మేమురువురము ప్రయాణ వినోదార్థము కానన భూమికేగితిమి. అందొక తరుణింగాంచి ఆమెపై మోహముగల్గి యామెను నిర్బంధించితిమి? కాని యా బిడ మాకెన్ని యో నీతులు దెల్పినది. మేమా నీతులువిశ్వసిం చక యామెతోవు మార్గమునిరోధించితిమి. అంత నాయమ యిట్లు బల్కినది. "రాజకుమారులారా! నేనొక్కటి దెల్పెదను వినుడు. మీ యిరువురిలెందు విడచిపెట్టుడు" అన మే మట్లు జేసితిమి.

కాంతు—మంచియుక్తి జెప్పినదే తిమ్మట?

1, 2 తిమ్మట యొకశరమును విసరివేసెదను. దానిముందు తెచ్చినవాని పెండ్లాడెదనని బల్కి శరమును వేగముగ విసరివేసెను. అంత మే మాశరము కొఱకై బరుగిడి శరముంగైకొని వచ్చునరికి యామె మాయిరువురలను రెండవశరమును గైకొని మొదోజ నినది. మే మందాలకుగినిసి దుస్తులు గోల్పోయి పురముంజేరు టకన్న యాకాంతి యొందగలదో నమకి పార్థించి మరల దుస్తు లగైకొనుట మేలనిదలంచి మార్గమం బట్టి యిచ్చుటికి జేరితిమి. ఇందా మెరొక్కకటముగాంచి దుఃఖించితిమి. అంత మమ్ము కారాగారవాసులుగ జేసిరి. ఇంతియే గాని వేరెఱుంగము.

కాంతు—మంచిది. అయ్యా! ఇందులకు మీయభిప్రాయమేమి?

కాంతా—తొలుతవీరి మోహముచే దుష్కార్యమునకుం బాల్పడియు కపటోపాయమున నా కాంత దుస్తులం గైకొనిపోవుటచే కాంత లభించకున్నను దుస్తులైన లభించిన మేలని దలంచి యిట్లుగా నా కాంతకై దిమ్మరుచున్నట్లు స్పష్టమైనది. కాని వీరికిని నా కాంతకును సంబంధ మేమియు లేదని తేటబడినది.

కాంతు—మంచిది. సంతసించితిని.

ఓయీ! బుద్ధిహీనులారా! ధనలేను మదాంధతచే కన్నుమిన్ను, గానక చిన్నపెద్దలని యెంచక పరవారులని దలంచక విఱ్ఱవీగకుఁడు. యీపురమున కెవ్వరైన విధివశమ్మున వచ్చిన వారిని నిర్బంధించి పాప మార్జింపక సద్బుద్ధిగల్గి మెలంగుఁడు. చిన్నతనపు చేష్టలు మానుఁడు. కీర్తి సంపాదింపుఁడు. భరతమాతను దుఃఖపెట్టకుఁడు. (వృద్ధతాపసినిం జూచి) అయ్యా! వీండ్రవలన నేలోపము లేదని సెలవిచ్చెదరా?

వృతా—ఏలోపమును లేదు.

కాంతు—ఇంక వీరికి సెలవీయఁదగునా?

వృతా—ఆఁ, నిరాటంకముగ.

కాంతు—మంచిది. అయ్యా! శ్రీయుత కాంతునిచే గోల్పోయి యిట్టి కష్టము లందిన కాంతను మరల ప్రాణకాంతుఁ డంగీకరింప నేమైన నాదియముండునా? ఈఁ డెట్లు దెల్పుడు?

వృతా—లోపమేమియు లేక తన పాతివ్రత్యమునుఁ గాపాడుకొనిన కాంతను నంగీకరింపవచ్చును. ఆపె యేల యంగీకరింపఁబడదు?

కాంతు—నాథా! చంద్రశేఖరబుధులు లేక ఇన్నికష్టములంది యీపురమునఁ జేరి పురుష వేషమున కాలము గడుపుచున్న నిర్భాగ్యురాలగు కాంతామతిని నేనే. ఇంక కరుణింపుఁడు.

(అనుబంధము ౪౧) (కాళ్లపైఁ బడును.)

వృతా—(ఆశ్చర్యముగ) తపస్వీ! నిజముగ నీవు కాంతామతివా?

కాంతు—నాథా! తమ సెలవయ్యేని పూర్వరూపముఁ జూపెద.

(స్త్రీ రూపముఁ జూపును.)

[ప్రవేశము: చంద్రరేఖ, చెలికత్తె, (ఒక వైపున)

కాంతా—సోదరీ! ఇట్టాశ్చర్యమునఁ జూచెదవేమి? ఇంతకాలము నుండియు,

గీ. పురుషరూపంబు ధరియించి ♦ పుడమినేలి
కాంతుఁడను పేరఁ బరగి నీ ♦ స్వాంతమునకు
సంతసము గూర్చి యుంటి బల్ ♦ వింతగాను
చంద్రరేఖ! సహోదరీ! ♦ సంగతిదియె.

నే నారుమాసంబులు గడువుచెప్పి యీమహానీయుఁడగు వారి యకాంతునికొఱకు. మఱియు నే నిదివఱకుఁ బడిన కష్టములెల్ల నాచే నిప్పుడు విచారింపఁబడిన పంచమహాపాతకులననెవ్వ నీయైదుగురివల ననే. వీండ్రిఁ జూచితివా? నీచాత్ములు.

ప్రతా—ప్రియకాంతా: కాంతామతీ!

చ. కలికిరో! నిగుణంబులను ♦ గన్గొననేరక వేశ్యమాటలన్
యిల నిజమంచునమ్మి నిను ♦ వీడితి గానకు మందబుద్ధినై
భళి! యన లోకమెల్లరును ♦ బాగుగ రాజ్యము నేలి దుష్టులన్
లలనరో! శిక్షచేసితివి ♦ లక్షణవంతులు జూచి మెచ్చగన్.

ప్రియా! నేనొనర్చిన దుష్కార్యముల మనమునం దెంచక నన్ను గావుము.

కాంతా—నాథా! ఇందు మీ రేమి చేసితిరి? ఇదియంతయు విధివశమున జరిగినది. ఇందులకు మీరు చింతింపకుఁడు. మఱియు నీకోమలాంగి మీమృదుకరపల్లవముం బట్టి సుఖంప మీకొఱకై నిరీక్షించుచున్నది. ఈమెం జేపట్టి కృతార్థురాలఁ జేయ ప్రార్థించుచుంటిని.

చంద్ర—ఆర్యా! నన్నును యీకళింగ రాజ్యలక్ష్మినిఁ జేపట్టి సుఖంప వేఁడుచున్నదాన. (నమస్కరించును)

ప్రతా—రామామణీ! నీకోర్కె నెరవేర్చు యట్లనే యంగీకరించెద లెమ్ము.

కాంతా—నాథా! శుభస్య శీఘ్రమ్మనునట్లిప్పుడే శుభముహూర్తము గూడదాపు జేరినది గావున యింకజాగుసేయకుండు. సేవకా!

(ప్రవేశము; సేవకుడు)

సేవ—సెలవు.

కాంతా—సత్వరంబుగ జని రెండుచితాసనములందెమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

(పునఃప్రవేశము; సేవకుడు కుర్చీలతో)

కాంతా—నూతనదంపతులారా! ఇయ్యాసనము లలంకరింపుడు.

ప్రితా—
చంద్రి— } [వాటిపై గూర్చుండుదురు]

కాంతా—(కర్పూరము వెలిగించి)

మంగళము [లొల్లాన్

మానినులుభూస్థలిని ♦ మాన్యతగడించిచిప్రియ, మంజులవచోమృతము
బూనుకొనిభర్తలకు♦బూజలొగిఁజేసియిల, పుణ్యవతులయ్యె నరుగాలన్
జానలనుబూరుషులు♦సంభ్రమముగగైకొనియు,జక్కగసుఖంబదరుగాతన్
మానవతులై నరతి♦మారసములిద్దరకు, మంగళము!మంగళమహాశ్రీ॥

సీ. ధాత్రియందు భరద్వాజ ♦ గోత్రయుతుఁడు
కరము గూడూరి వంశ్యుండు ♦ ఘనయశుండు
మల్లయార్యుని పౌత్రుండు ♦ పూజ్యతముఁడు
అరయ వేంకట శివకవి ♦ నాత్మజుండు
సిచ్చ దీని రచించెఁ గో ♦ టీశ్వరుండు.

(యవనిక జారును)

సంపూర్ణము.

వేశ్యలు— 4 పాట డ్యాన్సు,

మహారాజ సుగుణాధారా - మముబ్రోవుసుమశరీర
గావగ - కరుణ వేగ — మముగను (మా) ।మ।
నీసరియెవరీ - భూస్థలి గనుగొన
భాసురగాత్రా! - పరమపవిత్రా!
వాసిగ - చేకొనన్ - దగునికన్ - నీమదిన్ - రయమున ।మ।
మాదగుకోర్కెల - మహిదీర్చియువడి
సాదరముగ మము - సాకువు వేగన్ - జగాదాధారా ।మ।

---

కాంతా— 5 హిం॥ గోడి - రూపకతాళము

ఏమిసేతు? దైవఘటన - యెందుగాదు నేనిక...
కామితార్థదైవరాయ - కనియుబ్రోవవా...
నేరమేమిసేసియుంటినో? - నే నెఱుంగనే...
ధీరస్వాంత! ప్రాణకాంత! - దీననేలుమా...
కారాగార మందునుంచుట - కారణంబదేమిహా...
నేరమున్న వేరుశిక్ష - నేర్పించ రాదో కో... ।ఏ।

---

కాంచ— 6 బేహాగ్ రాగము - ఏకతాళము.

అహా! ... మర్మ్రముల్ దెలియ నెవ్వారితరమహా నిల? ।అ।
ఇలమోహాంబుధి - పలువేసంబులన్ - వడివేయుచునున్
ధనమార్జించగన్ - కాముకులముంచుచును - కాలంబుగడు
పుదుంగదా? ।అ।

---

కాంతా— 7 హిం॥ తోడి - రూపకతాళము.

నాథా! గహనబాధా! సైపగలేనే? నా॥

చెరసాలలోనన్ను - జేర్చి బాధించితే

పరగ వనములకంప - భావ్యామనీకిది॥ నా॥

ఎటుబోదు నేనింక? - యెవరింకదిక్కయ్యో! నా॥

కటకట! నాకిట్లు - గల్గునం చెఱుగనే॥ నా॥

తల్లి దండ్రులు నమ్మి - యుల్లము హర్షింప

కల్లమాటలఁ జెల్పి గల్లాలి కీపాట్లు. నా॥

---

ఉత్త— డైలాగ్.

మోహముఁదీర్పా కెందుబోయెద వే? కల్కిమితారి! కంతునికటారి॥ మో॥

కుందరదనా! యిందువదనా! యిందగనువా! వినగదే॥

సుందరీ నిన్ - విడువఁజాల - పొందగుండ నేనికన్॥ మో॥

---

కాంతా— చాల్ చాల్ నీచా! - సరసము దెలసెగా - సఖులను గో

రగదగునా ఛీ

పరనారీ మణులగోరా - దురితమా - నరకమా దెలియవా?

ఉత్త— దురితము నరకమదెందుఁగలదె - దూరమునుండెద వేలనే? బాలా

కాంతా— పనుల కఱియున్ - నరగున దెలియున్ - చాల్ చాల్

ఛీపో నరగున నీచా?

ఉత్త— నరుడనే నే - విరసము లేలనో? నరగున చెంతకు గా॥ రా॥ రా॥

కాంతా— దురితము కామ్యము - దూరమునుండుము - దుష్టుడ

ఛీ ఛీ పో.

## 9 డైలాగ్.

దుష్ట—చాల్ చాల్ నారీ! యోరాజకుమారీ.

కాంతా—ఏలను ఛీ పోరా నన్నిటు కోరతీరా

దుష్ట—సఖ వినవా?

కాంతా—ఓరి నీవు మనవా?

దుష్ట—పరహింసలు - కాంతరో పాపముగాద? యిల

కాంతా—పరనారిని - గోరుట - పాపముగాద? ధర

దుష్ట—పరసఖవౌదువా ?

కాంతా—కూ్రరని వెఱుఁగవా ?

దుష్ట—సరి సరి కాంతా! సరసకు రావా ?

కాంతా—సరసము జేరా ! సరగునపోరా ?

దుష్ట॥ నారీ! వయ్యారీ! చిన్నారి! మిఠారీ!

కాంతా॥ యేలను ఛీ పోరా! నన్నిటు కోరతీరా!

దుష్ట॥ చాల్ చాల్ నారీ! యోరాజకుమారీ!

---

ఖ్రితా॥ 10. బేహాగ్ రాగము - ఆదితాళము.

వేశ్యలఁగూడుట వెతలగునండీ - వెడగుమానుడిక - విటులందరును॥ వే॥

మోహముఁ జూపించి - ముద్దులఁదినిపించి - ముంచియు తేల్చరుగా ? విటులన్ - ముంచియు తేల్చరుగా ? ॥ వే॥

మాన్యములమ్మించు - రాజ్యములమ్మించు - యిల్లూ వాకిలీ సున్నా - విటులకుయిల్లూ వాకిలీ సున్నా ॥ వే॥

దాసుఁగాఁజేసి - హాసియుఁ దెగఁగోసి - వరుస క్షౌరముఁజేసి యుర్ - వేశ్యల్ వరుసగ క్షౌరము జేయుర్ ॥ వే॥

---

కాంచ॥ 11. 10వ పాటయే

భ్రితా॥ 12 హిం॥ తోడి-ఏకతాళము.

అకటా! యటగాంచెదను? నాపాపికేశ్వరిగనే ॥న॥
కూ్రిరుడనయ్యనే - బారగదోలితి॥
వారినివనమునకు - గురుపాపుడనై ॥యి॥
మూనినిమోదైన - మనితివాశేదాకా?
కాననమృగములుంవే - కనిమింగనేసిన్. ॥న్న॥

కాం॥ 13 ఫీలు-ఏకతాళము.

కరుణజాకవా? నాథా! వైరివినాశన
ధరణిపాల వందనీము-దరుణిబ్రోవవా? ॥క॥
కాంతామతికి కష్టముల్
కడదేర్ప రావ? నాథా!
కష్టదశలలోననుంటి బ్రోవ రావే



భ్రితా॥ 14 హిం॥ తోడి—అటతాళము.

అయ్యోనా కాంతామతి! కాంతామతి! పోయెను హా! హా ॥అ॥
పాపూ డా నే ని ల
బడరాని పాట్లన్ని బత్నికిడియు
కంపియుంచిని కానలకు పాపమునక
బాల యేలీల నుండెనో? కానలందు
వేశ్యచే నిట్లుగ్గగా వెతలునాకు. ॥అయ్యో॥

కాంతా। 15 హిం। తోడి-ఏకతాళము.

అకటా ! యెటుదోచదుగా ? యీగహనామున-జ-న- ॥అ॥

నాథా ! యీగతి - బాధలనొందెదు - నగనిశ్రీవవుగా ?

మానసమున

క్రూరులునగని - మారునిబారికి - సారెకుకుందుచునూ ।

దరిజేరగనా

మారశరీరా - మహితవిచారా - మనగలనీ ? ధీరా।

నిన్ గనకసిల ॥అ॥

---

1-2 రాజకుమారులు. 16 డైలాగ్.

1, రాజ। చెలియనీదు కౌఁగిలానగి - చెంతఁజేర్పరాగదే ? ॥చె॥

కలికీ ! యీమరుతూపుల - కిలను తాళజాల నింక

చలమేలను - ననుచేకొను - జలజానన ! మందగమన ! ॥చె॥

కాంతా॥ చాలునుపొమ్మా ! విసరనమెల్ల దెలిసెఁమా ॥చా॥

పరతరుణుల నిటుఁగోరగ - పాపమనుచుఁదలచవా ? ॥చా॥

2, రాజ॥ చానయిటులఁబల్కనికు - నగనమగున దలపునా ?

కానవుమున్నిధరగఁ - కాముకోటిదన్పినట్టి

మానినిచరితెమెందు - మహిని వినవె కామిని ! ॥చా॥

కాంతా। కానవివరు తీరటంచునెంచియు - మానసమున అనుమాన

మువదలియు పాత్రాపాత్ర విచారణనల్పక - వల్కుచుంటి

వేమందునునిన్నిక - ఏమనిపేర్కొలితిమాధాత్ముడా మానవాధ

మాధముడా ఛి. ఛీ. ఏ॥

చంద్ర॥ 17 బైలాగ్.

కామ్మ్రఝుంఝుంమ్మను - తుమ్మెదల రొదవిని
నిమ్మళించలేనమది - యాహాహా
చూడచూడనిటు చోద్యమయ్యెనకు - సుందరాంగి యిదివిన
కనగా యింపుగా - సొంపుగాన్ - పెంపుగా - అహా
యుండెనుజూడుము యాలతేల్
చెలి॥ కీరశారికా కిలకిలరవములు - కీరవాణిబల్ తీరుగ నుండెను,
కోరిమన్మధుఁడు - జేరిబాణముల - నారిమణుల పయి - నడ
పెనో యనగా ?
కూయసాగె - కుతుకముతోడ॥
చందురువదనా! సుందరనయనా! ॥కీ॥
చంద్ర॥ ఈయుద్యానము - యింపుగనుండె - యిందిరాక్షిరో! యి
దేనీవుగనుమా ?
విరులసొంపు-తరులపెంపు-శాఖలకింపు-బాలురసొంపు ॥యా॥



చంద్ర॥ ౧౮ హిం ॥ జోడి—ఏకతాళము.

ఆహాహా! యీయువకునిసరియగు - పురుషునిగంటిమ? వహ్వా
వహ్వా!
కంతు జయంతు వసంతుల మిగిలెని - కాంతరో ! వీనిపై
గల్గెను కాంతుల్
పూర్ణిమచంద్రుని గేరెడిమోముగ్ - భుజములు గిరులన బో
లెగ్ నగగ్,
కర్ణములెంచగ్ - శ్రీలనుమించగ్ - కనులను గాంచగ్
కమలములనగ్ ॥ఆ॥

## అనుబంధములు.

ఉత్త॥ 19 ముఖారి—ఆదితాళము.

ఆహా! కామినీ! కనుబడవై...తివ?
కానలో నిన్ను నే కనికొనియుంటిని
చానరో! నిన్నుఁగాంచ - చాలను నేనిక ॥ఆ॥

---

దుష్ట॥ 20 ముఖారి-ఆదితాళము.

ఆహా! కాంతరో! కనుబడవై...తివ?
రాజ్యముఁగోల్పోతి - రామరో! నిన్నని
వ్యాజము బన్నిటు - వ్యర్థుడనైతిగ ॥ ఆ ॥

---

దొంగ 21 ముఖారి-ఆదితాళము

యాడబోతివే? ఓ ఆడమడిశా! యాడబోతివే?
పెళ్ళిసేసుకుంటానని పారిబోతివే? ఆడమడిశా ॥యా॥



1, 2 రాజకుమారులు 22 ముఖారి-ఆదితాళము.

ఆహా! మానినీ! కనుబడవై...తివ?
నమ్మకముతో మున్ను - నమ్మతి బరచి
కొమ్మరో! నన్నుం - కొంచనియుంటివె! ॥ఆ॥

---

వ్రీతా॥ 23 ముఖారి-ఆదితాళము

హా! కాంతామణీ! కనుబడవై...తి వ?
నిన్ను నేగోల్పోతి - వినుబనములోననే
నన్ను కాంగిరో! నే - నిన్నుఁగఁగాంతునా? ॥ హా॥



శాం॥ 24 మోహనరాగము - ఏకతాళము.

కరుణగాంచి - కనికరించి - బ్రోవుము నాథా !
పడితి కష్టములెన్నో నేను - బిరుదకనేల? ప్రాణనాథ!
కడకుమిమ్ముల గాంచియుండితి - కష్టములన్ గట్టుబట్టి
క్రూరులచేబడి - కుందియున్న నన్
కృపచేగాంచియు - కూరిమినించియు ॥క॥



## జయంతజయపాలము



గ్రంథకర్త—బద్దిరెడ్డి కోటేశ్వర రావుగారు.

ఒకవంక వేశ్యాపిశాచి మాయోపాయములు; ఒకవంక బాల్య మిత్రుల ప్రేమావలోకనము; ఒకవంక తుచ్ఛమోహసామ్రాజ్యమున గలుగు యిక్కట్లు; ఒకవంక రాకుమారిణి వ్యభిచారిణియై కత్తిచేబూని భర్తను భయంకరముగ హత్యచేయుట; ప్రాణమిత్రుని దుస్థితి; పతివ్రతాశిరోమణివలన మృతకుమారుడు పునర్జీవితుడగుట; భార్యల విడిచి పరాంగనాలోలురైన పురుషులు పడెడి పాట్లన్నియు నిందు జక్కగ వర్ణింపబడినవి—ఇందు మేదరవాని యొలపాటలు; మహారాజపుత్రిక వ్యభిచారము, ప్రాణమిత్రుని పరితాపము, పతివ్రతమాహాత్మ్యము మృదుమధుర శైలిలో వర్ణింపబడినవి. చదివినకొలది మేనబులకలు జనింపక మానవు. గద్య, పద్యములు, హృద్యముగనుండును—

వెల రు, 0-12-0

వలయువారు; జనరల్ బుక్ డిపో బెజవాడ.

# హనుమద్రామ సంగ్రామము

ఆఱంకముల నాటకము,

(గ్రంథకర్త:—బద్దిరెడ్డి కోటీశ్వరరావుగారు.)

ఇందు యయాతి రాజును గురించి శ్రీరామాంజనేయులకు కలిగిన ఘోరయుద్ధము, విశ్వామిత్రుని కోపము, యయాతుని విచారము, అంగదరాయబారము, హనుమంతుని సత్యవాక్య పరిపాలన, రామునియొక్క గురువాత్సల్యము, మొదలగు సంశములతో విరాజిల్లుచున్నది. ఇదంతయు గయోపాఖ్యానమువలెనే యుండును. ఎన్నో ప్రతులు లేవు. త్వరపడనిచో ప్రతులు దొరక నేరవు వెల 0—12—0

# విజయభాస్కరము

ఆఱంకముల నాటకము.

(గ్రంథకర్త:—జమ్మలమడక లక్ష్మీనృసింహముగారు.)

ఇందు భట్టి విక్రమాదిత్యుని మనుమడగు విజయభాస్కరుని చరిత్రమంతయు మనోహరమగు శైలిని చక్కని సొంగ్సుతో వ్రాయబడినది. విజయభాస్కరుని శౌర్య ధైర్య గాంభీర్యములు చవిచూడవలెనన్న ఈనాటకమే తప్పక చదువతగినది. వెల 1—0—0.

# సంగీత గులోబకావలి

(గ్రంథకర్త:—చక్రావధానుల మాణిక్య శర్మగారు.)

నవరసములొల్కు ముద్దుల మూటగట్టు నాటకరాజము. ఈ నాటకమంతయు, శృంగార రసమే. ఎచ్చట చదివిచూచిన ఆనందమే, ఈనాటకము చదువుట మొదలుపెట్టినచో సాంతమగువఱకు విడువజాలరు, ఇందచ్చటచ్చట పార్సీమట్లు కూడా చేర్చబడినవి.

వెల 1—0—0

వలయువారు:—కందులగోవిందం, జనరల్ బుక్కుడిపో,

బెజవాడ. కృష్ణాజిల్లా.

